శ్లో. జాతః కూర్మః స ఏకః పృథుభువనభరా యార్పితం యేన పృష్ఠం
శ్లాఘ్యం జన్మ ధ్రువస్య భ్రమతి నియమితం యత్ర తేజస్వి చక్రం
సంజాతవ్యర్థపక్షాః పరహితకరణే నోపరిష్టాన్న చాధో
బ్రహ్మాణ్డోదుంబరాంతర్మశకవ దపరే జంతవో జాతనష్టాః. 69

చ. వితతజగద్భరంబు దన ♦ వీఁపునఁ దాల్చినకూర్మనాథుడున్
సతతము చంద్రభాస్కరుల ♦ చక్రముఁ ద్రిప్పుధ్రువుండు సజ్జనుల్
ప్రతిభ నజాండజంతుఫల ♦ రంధ్రవశన్మశకంబులట్లనిం
దితవిఫలార్థ సంగతి జ ♦ నించి నశించుఁ దదన్యజంతువుల్. 69

తా. అవతారములలో నాదికూర్మము పదునాల్గుభువనములను దనమూపున భరించుచున్నది. అవతారములలో నెల్లయదియే ధన్యజీవి ధ్రువుఁడు జ్యోతిశ్చక్రమును దిప్పుచున్నాడు. కాన యాతఁడు ధన్యుఁడు. వారిద్దరి మధ్యగా సమస్తప్రాణులు, పుట్టుచు, గిట్టుచున్నవి. ఈప్రాణుల గతి మేడిపండులోని దోమల విధముగా నున్నది గదా?

శ్లో. తృష్ణాంఛింది భజ క్షమాం జహి మదం పాపే రతిం మా కృథాః
సత్యం బ్రూ హ్యనుయాహి సాధుపదవీం సేవస్వ విద్వజ్జనమ్
మాన్యా న్మానయ విద్విషోప్యనునయ ప్రఖ్యాపయ ప్రశ్రయం
కీర్తిం పాలయ దుఃఖితే కురు దయా మేత త్సతాం చేష్టితం. 70

శా. ఆశాసంహరణంబు నోర్మియు మద ♦ త్యాగంబు దుర్దోషవాం
ఛాశూన్యత్వము సత్యమున్ బుధమతా ♦ చారంబు సత్సేవయున్
వైశద్యంబును శత్రులాలనము మా ♦ న్యప్రీతియుం బ్రశ్రయ
శ్రీశాలిత్వము దీనులందుఁ గృపయున్ ♦ శిష్టాలికిన్ ధర్మముల్. 70

తా. సజ్జన వ్యాపారములేవియన, ఆశలేకుండుట, ఓర్మి కలిగి యుండుట, విద్యవలనిమదము నడఁచుట, పాపపు బనులను జేయకుండుట, సత్యమందాసక్తి యుండుట, సన్మార్గ వర్తనము కలిగియుండుట, విద్వజ్జనులం గొలుచుట, పూజ్యులను బూజించుట, పగవారలైనను లాలించుట, పెద్దలయెడ గౌరవముగనుండుట, కీర్తిని రక్షించుకొనుట, దుఃఖితులందు దయకలిగి యుండుట.

శ్లో. మనసి వచసి కాయే పుణ్యపీయూషపూర్ణా
స్త్రిభువనముపకారశ్రేణిభిః ప్రీణయన్తః
పరగుణపరమాణూన్ పర్వతీకృత్యనిత్యం
నిజహృది వికసంత స్సంతిసంతః కియంతః. 71

చ. హృదయవచశ్శరీరముల ♦ నెంతయుఁ బుణ్యసుధాప్రపూర్ణులై
ముదముబహూపకారముల ♦ మూఁడుజగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణాల ♦ వంబులు గొండలు సేసి మెచ్చుచున్
మదిని వికాసయుక్తు లగు ♦ మాన్యులు గొందఱు వొల్చురిద్ధరన్. 71

తా. మనసా వాచ శరీరంబుల పుణ్యమనే అమృతముచే నింపబడినవారై ఆనందంబును, ఉపకారము, తిరిలోకంబుల నుల్లసిల్లజేయుచున్నారును, ఇతరుల కొంచపుగుణములను గొప్పవిగాజేసి మనస్సునందు యానందించుచేసి సుజనులు కొందఱే కలరుగాని పెక్కుమంది లేరు.

## 8 ధైర్యపద్ధతి.

శ్లో. రత్నైర్మహార్హై స్తుతుషు ర్న దేవా
న భేజిరే భీమవిషేణ భీతిమ్
సుధాం వినా నప్రియ యుర్విరామం
న నిశ్చితార్థా ద్విరమంతి ధీరాః. 72

తే. గీ. తనిసిరే వేల్పు లుదధి ర ♦ త్నముల చేత
వెఱచిరే ఘోర కాకోల ♦ విషము చేత
విడిచిరే యత్న మమృతంబు ♦ వొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు 72

తా. రాక్షసులు, దేవతలు, అమృతాసక్తిచే పాలసముద్రమును తఱచిరి. అందు మొదట రత్నములు బుట్టినవి. ఆరత్నములతో దేవరాక్షసులు సంతోషింపలేదు. కొంతకాలమునకు ముల్లోకంబుల దహించివైచు హాలాహలంబను మహావిషముఁ బుట్టినది.

దానికి వారు భయపడలేరు. వారు కోరిన యమృతము పుట్టువఱకు విలుకొటను మాన లేదు. అట్లే ధైర్యసంపన్నులు ప్రారంభించిన కార్యమగువఱకు తమయభిప్రాయము వదలరు.

శ్లో. ప్రారభ్యతే న ఖలువిఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్ననిహతా విరమంతి మధ్యాః
విఘ్నైః పునఃపునరపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణా న పరిత్యజంతి. 73

శా. ఆరంభింపరు నీచమానవులు ♦ ఘ్నాయాస సంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురురువి ♦ ఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ♦ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ♦ ప్రజ్ఞానిధుల్ గావునన్. 73

తా. విఘ్నముకలుగునని భయముచే యధములు ఏపనిని యారంభింపరు. మధ్యము లేపనినైన మొదలుపెట్టి మధ్యయాటంకముగలిగినేని మానివేయుదురు. ధైర్యమే మొదటిగుణముగాగల యుత్తములు తాము ప్రారంభించినపని నెఱవేరువఱకు మాటిమాటికి విఘ్నములు గలిగినను విడువక జేయుదురు.

శ్లో. క్వచి త్పృథ్వీశయ్యః క్వచి దపిచ పర్యంకశయనః
క్వచి చ్ఛాకాహారః క్వచి దపిచ శాల్యోదనరుచిః
క్వచి త్కంథాధారీ క్వచి దపిచ దివ్యాంబరధరో
మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖం. 74

మ. ఒకచో నేలను బవ్వళించు నొకచో ♦ నొప్పారుఁ బూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో ♦ నుత్కృష్టశాల్యోదనం
బొకచో బొంతధరించు నొక్కొకతఱిన్ ♦ యోగ్యాంబర శ్రేణి లె
క్కకు రానీయఁడు కార్యసాధకుఁడుదుః♦ఖంబున్ సుఖంబున్ మదిన్.

తా. కార్యసాధకుఁడు తన పని నెరవేఱుటకు యెట్టికష్టములనైనను గాని లెక్కసేయఁడు కార్యసాధనమునకై యొకప్పుడు కటిక నేలమీద గాని మృదువైన పరుపు పరువబడిన పర్యంకమునందు గాని బరుండును. కందమూలములను గాని లేక పంచ

భక్ష్య పరమాన్నమునుగాని భుజించును. సహస్రాక్షులు గలిగిన చింకిబొంతనుగాని కాంచన పీతాంబరమునుగాని ధరించును.

శ్లో. నిందంతు నీతి నిపుణా యది వా స్తువంతు
లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్
అద్యైవ వా మరణమస్తు యుగాంతరే వా
న్యాయ్యాత్పథః ప్రవిచలంతి పదం న ధీరాః. 75

శా. నీతి ప్రౌఢ విహారు లైన నిపుణుల్ ♦ నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ ♦ గాఢంబుగా పోఁగనీ
ఘాతం బిప్పుడు పొందనీ నియతి మ్మ ♦ గానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపదంబు దప్పరుగదా ♦ నిత్యంబు ధీరోత్తముల్. 75

తా. బుద్ధిమంతులు పరులు తమ్ము భూషించినను, లేక దూషించినను, మరణమిప్పుడే కలిగినను, లేక యుగాంతంబందు కలిగినను, నీతిపదమును మాత్రమును దప్పక యుందురు.

శ్లో. కాంతా కటాక్షవిశిఖా నఖనంతి యస్య
చిత్తం ననిర్దహతి కోప కృశాను తాపః
కర్షంతి భూరివిధయాశ్చ న లోభ పాశై
ర్లోకత్రయం జయతి కృత్స్న మిదం సధీరః. 76

ఉ. మానవతీకటాక్షశిత ♦ మార్గణముల్ విదలింపఁ జాల వె
వ్వానిమనంబు కోపమయ ♦ వహ్ని దహింపదు లోభపాశసం
తానము మాల్యచందన ని ♦ తానములున్ నెతసేయనోపఁగా
వ్వానివశంబునన్ మెలఁగు ♦ వాఁడు జయించు జగంబులన్నియున్.

తా. ఏమనుజుని మనస్సు లతాంగివాడితూపులు నాటింపలేవో, కోపాగ్ని కింధనముకాదో, పేరాసలు లేక లోభమనెడి త్రాళ్లకు చిక్కక, భోగ భాగ్యంబులకుఁ గడుగొనక వాఁడే సమస్త లోకములను జయించును.

శ్లో. కదర్థితస్యాపి హి ధైర్యవృత్తే
ర్నశక్యతే ధైర్య గుణః ప్రమార్ష్టుమ్
అధో ముఖస్యాపి కృతస్య వహ్నే
ర్నాధ శ్శిఖాయాతి కదాచి దేవ. 77

తే. గీ. నియతిచేతఁ గదర్థితుం ♦ డయిన ధైర్య
పరుని ధైర్యగుణంబు మా ♦ న్పంగఁ దరమె
క్రిందుసేయంగఁ బడినట్టి ♦ కృష్ణ పధుని
కీలయొందయిన మీఁదుగాఁ ♦ గెరలుఁ గాదె. 77

తా. మండుచున్న యగ్నిని దలక్రిందుఁజేసినచో దానిజ్వాల క్రిందికిపోనట్లు ధైర్యవంతు నెంతభంగపరచినను వాని ధైర్యముజెడదు.

శ్లో. వరం తుంగాచ్ఛృంగా ద్గురుశిఖరిణః క్వాపివిషమే
పతిత్వాయం కాయః కఠినదృషదంతే విదలితః
వరంన్యస్తో హస్తః ఫణిపతిముఖేతీక్ష్ణదశనే
వరంవహ్నౌపాత స్తదపి న కృత శ్శీలవిలయః. 78

చ. ఉరుతర పర్వతాగ్రమున ♦ నుండి దృఢం బగు ఱాతిమీఁద స
త్వరముగఁ ద్రెళ్లి కాయము హ ♦ తంబుగఁ జేయుట మేలు గాలిమే
పరిదొరవాఁత గేలిడుట ♦ బాగుహుతాశన మధ్యపాతముం
వరమగుఁజారుశీలగుణ ♦ వర్జన మర్హ్వముగాదు చూడఁగన్. 78

తా. గొప్ప కొండచివరభాగమునుండి పెద్దరాతిపై నతితొందరగా దేహమును వలుగగొట్టుకొని చచ్చుటమంచిది. లేక పదునైనకోరలుగలిగిన యాదిశేషుని ముఖ మందు చేతులుంచుట గొంత మంచిది. అగ్నిజ్వాలలయందుబడి భస్మమగుట మేలుకాని సుగుణముల విడుచుట మాత్రము మంచిదికాదు.

శ్లో. వహ్ని స్తస్య జలాయతే జలనిధిః కుల్యాయతే తత్క్షణా
న్మేరుః స్వల్పశిలాయతే మృగపతి స్సద్యః కురంగాయతే

వ్యాలో మాల్య గుణాయతే విషరసః పీయూషవర్షాయతే
యస్యాంగేఖిలలోకవల్లభతమం శీలం సమున్మీలతి. 79

చ. అతనికి వార్ధికుల్యయగు ♦ నగ్ని జలంబగు మేరుశైల మం
చిత శిలలీలనుండు మద ♦ సింహము జింక తెఱంగుఁ దాల్చుఁ గో
పితఫణి పూలదండయగు ♦ భీష్మవిషంబు సుధారసంబగున్
క్షితి జనసమ్మతంబగు సు ♦ శీలము దెవ్వని యందు శోభిలున్. 79

తా. సుశీల మదెవ్వనియందు మూర్తీభవించి యుండునో యాతనికి సహించు నట్టియగ్ని నీటివలె జల్లగను, పొడవగు మేరుపర్వతము చిన్న రాయి వలెను, దాటరాని సముద్రము చిన్నకాలువగాను, మదించిన సింహము లేడి వంటిదిగాను, విషసర్పములచే కూర్పఁబడి యుండు పూలదానము వలెను, కాకోలవిషమమృతముతో సమానముగను ఇట్లు దుఃఖకరములగునవి సుఖవంతము లగును.

శ్లో. ఛిన్నోపి రోహతి తరుః
క్షీణో ప్యుపచీయతే పున శ్చంద్రః
ఇతి విమృశ న్తః స న్తః
స న్తప్యన్తే న విప్లుతా లోకే. 80

తే. గీ. ఖండితంబయ్యు భూజంబు ♦ వెండి మొలచు
క్షీణుఁడయ్యును నభివృద్ధిఁ ♦ జెందు సోముఁ
డివ్విధమున విచారించి ♦ యొడలు తెలియ
జనములకు దాపమొందరు ♦ సాధు జనులు. 80

తా. చెట్టు ఖండితమైనను తిరిగి మొలచును చంద్రుడు క్షీణించిపోవుచున్నను తిరిగి యభివృద్ధిఁ జెందును. ఈవిధముగనే శీలవంతులు కష్టకాలమందు దుఃఖితాత్ములు కాక తరు చంద్రులవలె యభివృద్ధిఁ జెందెదమని తలపోయుదురు. కనుక వారెల్లపుడు నిత్యసంతోషులే.

శ్లో. ఐశ్వర్యస్య విభూషణం సుజనతా శౌర్యస్య వాక్సంయమో
జ్ఞాన స్యోపశమః శ్రుతస్య వినయో విత్తస్య పాత్రేవ్యయః

అక్రోధ స్తపసః క్షమా ప్రభవితుర్ధర్మస్య నిర్వ్యాజతా
సర్వేషా మపి సర్వకారణమిదం శీలం పరం భూషణం. 81

ఉ. జానుగ భూతికిం దొడవు ♦ సజ్జనభావము శౌర్యలక్ష్మికిన్
మానము నీతివిద్యకు శ ♦ మంబు సుబుద్ధికి విత్తవృద్ధికిం
దానము దాల్మి శక్తికిని ♦ ధర్మ నిరూఢి కదంభవృత్తియుం
బూనికతోడ సర్వగుణ ♦ భూషణ మెన్నఁగ శీలమేసుమీ. 81

తా. సంపద కలిగినతఱి మంచితనంబును, శౌర్యమునకు వాక్చాతురతయు విద్యకుఁ దగిన నేర్పరితనంబును సుబుద్ధికి దగిన వినయమును భాగ్యమునకుఁ దగిన సత్పాత్ర వినియోగమును తపస్సుకు గోపము లేమియు సామర్థ్యమునకు సహనమును ధర్మమునకు కపటము లేకపోవుటయును అలంకారమై యలంకారములకు సుస్వభావము పెద్ద యలంకారమై యుండును.

# 9 దైవపద్ధతి.

శ్లో. నేతా యస్య బృహస్పతిః ప్రహరణం వజ్రం సురాః సైనికాః
స్వర్గో దుర్గ మనుగ్రహః ఖలుహరే రైరావణో వారణః
ఇత్యాశ్చర్య బలాన్వితోపి బలభి ద్భగ్నః పరైః స్సంగరే
తద్వ్యక్తం నను దైవమేవ శరణం ధిక్ ధిక్ వృధా పౌరుషమ్. 82

చ. గురుఁడు గురుండు వాలు శత ♦ కోటి సుపర్వులు వాహినీపతుల్
సురభవనంబు గోట మధు ♦ సూదనుఁడున్ సయిదోడు దంతి ది
క్కరిపతిగాఁగ నొప్పు బల ♦ ఘాతియు దాయల కోడె నాజిలో
శరణము దైవమే పురుష ♦ శక్తి నిరర్థక మెన్ని భంగులన్. 82

తా. సురేంద్రునకు సలహాలు నిచ్చువాతడు బృహస్పతి. కొండలరెక్కలను గొట్టినను మొక్కపోని వజ్రము ఆయుధము. దేవతలా సైనికులు. స్వర్గమాతని కోట. సర్వలోకాధినాయకుండగు శ్రీమహావిష్ణువకు అనుగ్రహపాత్రుఁడైన వాడు ఐరావత

ము వాహనముగా గలవాఁడు. ఇట్లనంత బలసంపన్నులైనను ... 
ము. కావున దైవమే ప్రధానముగాని పౌరుషమెంతయు వ్యర్థము.

శ్లో. భగ్నాయస్య కరండ పిండితతనో ర్గ్లానేంద్రియస్య క్షుధా
కృత్వాఖు ర్వివరం స్వయం నిపతితో నక్తం ముఖే భోగినః
తృప్తస్తత్పిశితేన సత్వర మసౌ తేనైవ యాతః పథా ।
స్వస్థాస్తిష్ఠత దైవమేవ హి పరం వృద్ధౌ క్షయే కారణం. 83

ఉ. రాతిరి మూషకంబు వివ ♦ రం బొనరించి కండరి బద్ధము
భీతిలి చిక్కి యాసచెడి ♦ పెద్దయు డస్సిన పామువాత సం
పాతముఁ జెందె దానిఁ దిని ♦ పాము దొలంగె బిలంబు త్రోవనే
యేతఱి హానివృద్ధులకు ♦ నొక్కటి దైవము కారణంబగుఁ. 83

తా. ఒకానొక రాత్రి యొకయెలుక క్షుద్బాధ కాగలేక యొకపెట్టెకు రంధ్ర మొనరించి లోనప్రవేశించెను. అంతకుఁబూర్వ మొకపాము పెట్టెలో చిక్కి యాహారములేక చచ్చుటకు సిద్ధముగా యుండెను. ఎలుక రాగనే యాయెలుకనుఁ దిని ఎలుక చేసిన రంధ్రముగుండా పోయి ప్రాణము రక్షించుకొనెను. ఆహారము కొరకుపోయిన ఎలుక పాముపాలైపోవుటయు నాపసిద్ధముగా యున్నపాము బ్రతుకుటయుఁ జూడగా యేతరినైనను హానివృద్ధులకు దైవమే ప్రధానముగుట స్పష్టమేకదా.

శ్లో. యథాకన్దుక పాతేనో
త్పతత్యార్యః పతన్నపి
తథా త్వనార్యః పతతి
మృత్పిండపతనం యథా. 84

క. కందుకమువోలె సుజనుఁడు
గ్రిందంబడి మగుడమీఁదికి ♦ న్నెగయుఁ జుమీ
మందుఁడు మృత్పిండమువలె
గ్రిందంబడి యడఁగి యుండు ♦ గృపణత్వమునన్. 84

తా. క్రిందఁబడిన బంతి పైకిలేచునట్లు భక్తితో నిండిన మానవుఁడు క్రిందపడినను తిరిగి పైకివచ్చును. మట్టిముద్ద క్రిందఁ బడినచో తిరిగి లేవలేనట్లు భక్తిరహితుఁడు క్రిందుగా పడినచో దిరిగి లేవనేరడు.

శ్లో. ఖల్వాటో దివసేశ్వరస్య కిరణై స్సంతాపితో మస్తకే
వాంఛన్దేశ మనాతపం విధివశా త్తాలస్య మూలం గతః
తత్రాప్యస్య మహాఫలేన పతతా భగ్నం సశబ్దం శిరః
ప్రాయోగచ్ఛతి యత్ర దైవహతక స్తత్రైవ యాన్త్యాపదః. 85

మ. ధర ఖల్వాటుఁ డొకండు సూర్యకరసం ♦ తప్తప్రధానాంగుఁడై
త్వరతోడన్ బరువెత్తి చేరి నిలిచెన్ ♦ దాళద్రుమచ్ఛాయఁ ద
చ్ఛిరముం దత్ఫల పాతవేగమున వి ♦ చ్చెన్ శబ్దయోగంబుగాఁ
బోరి దైవోపహతుండు వోవు కడకుం ♦ బోవుం గదా యాపదల్.

తా. బట్టతలవాఁడొకఁడు నిశితసూర్యకిరణంబులకుఁ దాళజాలక యొకతాలవృక్ష నీడను నిలువఁబడెను. ఇంతలో నొకతాలఫలము వానితలపై బడి తల బ్రద్దలయ్యెను. కావున దైవానుగ్రహము లేనప్పుడెన్నియో కష్టములే ప్రాప్తించును.

శ్లో. గజ భుజంగ విహంగ మబంధనం
శశి దివాకరయో ర్గ్రహపీడనం
మతిమతాంచ విలోక్య దరిద్రతాం
విధి రహో బలవానితి మేమతిః. 86

తే. గీ. ఫణులు గజములుఁ బక్షులుఁ ♦ బట్టు వడుట
రవి సుధాకరులకునైన ♦ రాహు బాధ
బుద్ధిమంతుల లేమియుఁ ♦ బొసగఁ జూచి
విధి బలాఢ్యుఁ డటంచు భా ♦ వింతుమదిని. 86

తా. పట్టుకొన శక్యముగాని ఏనుగులు, పక్షులు పట్టుబడుచున్నవి. తేజోవంతులును, ముల్లోకములను దమకాంతితో నిండింపఁజేయు సూర్యచంద్రులను రాహువు పట్టి పీడించుచున్నాఁడు. ఔరా! దైవమాయ యెట్టిదో యెఱుంగలేము గదా!

శ్లో. సృజతి తావ దశేష గుణాకరం
  పురుష రత్న మలంకరణం భువః
  తదసి తత్క్షణ భంగి కరోతి చే
  దహహా కష్ట మపండితతా విధేః.          87

క. గుణమణిఖనియగు పూరుష
  మణిధరణికి రవణముగన ♦ మర్చినవిధి గా
  గుణవంతుని వెసఁద్రుంచి మిను
  గుణహీనునిగాగఁ నెన్న ♦ కొనరే ధాతన్.          87

తా. బ్రహ్మ సర్వగుణ సంపన్నుండును, ప్రపంచమున కలంకార భూతుండగు వానిని బుట్టించి త్వరగా వానిని మృత్యుముఖమునఁ బడవైచినచో నా బ్రహ్మను తెలివి తక్కువవానిగా భావింతురు ఎటులైనను దైవమే ప్రధానముగదా?

శ్లో. అయ మమృతనిధానం నాయకో ప్యోషధీనాం
  శతభిషగనుయాతః శ్శంభుమూర్ధ్నోవతం సః
  విరహయతి న చైనం రాజయక్ష్మా శశాంకం
  హతవిధి పరిపాకః కేన వాలంఘ నీయః.          88

చ. శతభిషగాఢ్యుఁడుగ్ సతత ♦ శంభు వతంసమునయ్యు నోషధీ
  తతులకు నాధుఁడయ్యును సు ♦ ధారస శేవధియయ్యు దారకా
  పతి దనరాజయక్ష్మ భవ ♦ బాధలఁ బాపఁగ నోపఁడక్కటా
  హతవిధికృత్య మెవ్వనికి ♦ నైన జగంబున దాఁట వచ్చునే.          88

తా. అమృతముండు తావున చంద్రుడుండును. సంజీవినీ మొదలగు మూలికా సముదాయనకు ప్రభువు. ఈతనితోఁ గూడనొక వందమంది వైద్యులుందురు. పైగా లయకారకుండగు శంభుని శిరమందుండువాడు అయినను తనకుగల క్షయ బాధమాన్పు కొనఁ జాలడు. కావున పాపిష్టిదైవముయొక్క నియోగము దప్పింప నేరికి శక్యము గాదు.

శ్లో. ప్రియసఖ విపద్దండాఘాతప్రపాతపరంపరా
పరిచయబలే చింతాచక్రే నిధాయ విధిః ఖలః
మృద మివ బలాత్పిండీకృత్య ప్రగల్భకులాలవ
ద్భ్రమయతి మనో నో జానీమః కి మత్ర విధాస్యతి. 89

చ. కలితవిపత్తిదండపద ♦ ఘట్టనసేయుచు మన్నుగా వడి౯
ఖలుఁడు విధాత పిండితము ♦ గా నొనరించి నితాంతచింత య౯
బలితపుసారెపై నిలిపి ♦ పాయక చందము ద్రిప్పుచున్నవాఁ
డలమి కులాలరీతిఁ దెలి ♦ యంగలవారమె యేమిసేయునో? 89

తా. కుమతుడగు బ్రహ్మ వానిచిత్తమును కష్టములచేతను, చింతయనెడి చక్రము నందు త్రిప్పివేయుచున్నాడు. ఏమి చేయుట కిట్లు త్రిప్పుచున్నాడో తెలియకున్నది.

శ్లో. విరమ విరమాయాసా దస్మా ద్దురధ్యవసాయతో
విపది మహతాం ధైర్యధ్వంసం యదీక్షితు మీహసే
అయి జడ విధే కల్పాపాయే వ్యపేతనిజక్రమాః
కులశిఖరిణః క్షుద్రా నైతే న వాజలరాశయః. 90

చ. దొసఁగులు వచ్చువేళ గుణ ♦ ధుర్యుల ధైర్యగుణంబు సర్వముం
బన చెడునంచుఁ జూచెదవు ♦ పాపపు దైవమ యీ దురాగ్రహ
వ్యసనము మానుమాను ప్రళ ♦ యంబున వీతనిజక్రమంబులై
పసి సెడ వించుకంతయును ♦ సాగరముల్ గులపర్వతంబులున్. 99

తా. దుష్టదైవమా! మహాత్ములకు కష్టములు కలిగించి వారిధైర్యము పోఁగొట్టఁ జూచెదవు కాని యుగాంతమందు సప్తకులపర్వతములును, సప్తసముద్రములును, తమ మేరఁదప్పినను మరల నవి దమ తమ మేరలయందే నెలకొనునుగదా!

శ్లో. దైవేన ప్రభుణా స్వయం జగతి య ద్యస్య ప్రమాణీకృతం
తత్తస్యోపనమే న్మనా గపి మహా న్నైవాశ్రయః కారణమ్

సర్వాశాపరిపూరకే జలధరే వర్షత్యపి ప్రత్యహం
సూక్ష్మా ఏవ పతంతి చాతకముఖే ద్విత్రాః పయోబిందవః 91

గీ. ఎవ్వనికి నిజ్జగంబున ♦ నెంతఫలము
దైవకృతమగునది వొందుఁ ♦ దప్పకతనిఁ
గారణముగాదు పెనుఁబ్రాపు ♦ ఘనునిఁజేరు
చాతకము వాఁతెబడునల్ప ♦ జలకణములు.

తా. లోకంబునందెవ్వని కెంత ఫలము బ్రహ్మచే నిశ్చయింపబడినదో దానిని వాఁడవశ్యము బొందఁగలఁడు. కనుక గొప్పవారి నాశ్రయించిన నంతకంటె యెక్కువ ధనము బొందలేఁడు. ఎట్లన మేఘుఁడు జనులచే యాచింపబడకయే వలసినంత వర్షము గురియించుచున్నాఁడు. వర్షముకొరకై కను పెట్టుకొనియుండిన చాతకపక్షి నోటియందు ఒకటిరెండు చుక్కలుకంటె నెక్కువ పడుట లేదు గదా?

# 10 కర్మపద్ధతి.

శ్లో. నమస్యామోదేవాన్ననుహతవిధేస్తేపివశగా
విధిర్వంద్యస్సోపి ప్రతినియతకర్మైకఫలదః
ఫలంకర్మాయత్తం కిమమరగణైః కించవిధినా
నమస్తత్కర్మేభ్యో విధిరపినయేభ్యః ప్రభవతి. 91

చ. శిథిలతలేనిభక్తినతి ♦ సేయుదు వేల్పుల కానువర్వులుా
విధివశవర్తులావిధియు ♦ విశ్రుతకర్మఫల ప్రదాతయ
య్యధికఫలంబు కర్మవశ ♦ మట్లగుటంబనియేమి వారిచే
విధికధికంబు గర్మమని ♦ వేమరుమ్రొక్కిభజింతుఁ గర్మమున్. 92

తా. సకల ఫలములనిచ్చు దేవతలకు నమస్కరించుదము. ఆదేవతలు గూడ బ్రహ్మకు వశులైనవారు కావున బ్రహ్మను పూజించుదము. బ్రహ్మఁగూడ కర్మను బూర్వమే యేర్పడియుండు ఫలము నేయిచ్చును. కావున వీరలతో బనియేమి? సకల ఫలములకు కారణమైన కర్మకు నానేక సాష్టాంగ నమస్కారములఁ జేయుదుము.

శ్లో. బ్రహ్మా యేన కులాలవన్నియమితో బ్రహ్మాండ భాండోదరే
విష్ణుర్యేన దశావతార గహనే క్షిప్తో మహా సంకటే
రుద్రో యేన కపాలపాణి పుటకే భిక్షాటనం సేవతే
సూర్యో భ్రామ్యతినిత్యమేవ గగనే తస్మైనమః కర్మణే. 93

చ. నలువ కులాలుభంగి నలి ♦ నబ్రభవాండమునందు దేనిచే
నిలిచె దశావతార వన ♦ నిక్షితుడయ్యె మురారి దేనిచేఁ
బెలుచఁ గపాలహస్తుఁడయి ♦ భిక్షుకుడయ్యెఁ బురారి దేనిచే
నలరవి దేనిచే దిరుగు ♦ నాఘనకర్మము వంద్యమే కదా. 93

తా. బ్రహ్మ దేనిచే సర్వప్రపంచములందు జీవరాసులను కుమ్మరవాడు కుండలను జేయురీతిగా సృజించుచున్నాడో, శ్రీమహావిష్ణువు దేనిచే దశావతారముల నెత్తి పెనుకష్టములకు లోనయ్యెనో దేనిచే శివుడు మనుజ పునుకను పాత్రగా జేసుకొని బిచ్చమెత్తుకొనుచుండెనో, సూర్యుడు దేనిచే యొకనిముషమైన నిలువక యాకాశమున దిరుగుచుండెనో, యట్టి సర్వనియమన శక్తిగల ఘనకర్మమునకు నమస్కారము చేయుచున్నాను.

శ్లో. యా సాధూంశ్చఖలాన్ కరోతివిదుషో మూర్ఖాన్ హితాన్ ద్వేషిణః
ప్రత్యక్షం కురుతే పరోక్షమమృతం హాలాహలం తత్క్షణాత్
తామారాధయ సత్క్రియాం భగవతీం భోక్తుం ఫలం వాంఛితం
హే సాధోవ్యసనైర్గుణేషు విపులే ష్వాస్థాంవృథా మాకృథాః. 94

మ. ఖలునిన్ సజ్జనుఁగాఁగ మూర్ఖజను సం ♦ ఖ్యావంతునింగాఁగ దా
యల సన్మిత్రులఁగా నగోచరముఁ బ్ర ♦ త్యక్షంబుగాఁ బ్రాణహృ
త్కలనంబైన మహావిషం బమృతముం ♦ గాఁజేయు సత్కర్మము
జ్వల నిష్ఠానిధివై భజింపుము వయ ♦ స్యా వాంఛితార్థాప్తికిన్. 94

తా. నేస్తకాడా! నిచ్చైన నొకకొంక బడయదలంచితివేని సుజనులను కుజనులను గాను, మూర్ఖులను విద్వాంసులనుగాను శత్రువులను హితులనుగాను, ఇంద్రియములకు [illegible] నమృతముగాను జేయు

గలిగిన ఘనకర్మకు నమస్కారముఁ జేయుము. అట్లుగాక నిజస్త్రోమోగుణాగులను బట్టి తివేని వవి క్లేశముతో గూడిన ఫలమిచ్చును గాన వానికొఱకై వ్యర్థముగాఁ బాటు పడకుము.

శ్లో. శుభ్రం సద్మ సవిభ్రమా యువతయః శ్వేతాతపత్రోజ్జ్వలా
లక్ష్మీ రిత్యనుభూయతే చిర మనుస్యూతే శుభే కర్మణి
విచ్ఛిన్నే నితరా మనంగ కలహ క్రీడాత్రుటత్తంతుకం
ముక్తాజాల మివ ప్రయాతి ఝడితి భ్రశ్యద్దిశో దృశ్యతాం. 95

చ. లలిత నికేతనప్రియు వి ♦ లాసవతీ ధవళాత పత్రస
ద్విలసిత వైభవంబనుభ ♦ వింపఁ బడున్ సుకృతాను వృత్తిచేఁ
జెలువగు పుణ్యకర్మము న ♦ శించిన నంగజ సంగరత్రుట
త్కలిత గుణోరుమౌక్తికని ♦ కాయములట్లు దొలంగు సంపదల్.

తా. చెలికాడా! తొలి జన్మంబునఁ జేసిన పుణ్యములవలన గాకర్మఫలపక్వ మెడతెగక యనువర్తించుచుండగాఁ సుందర భవనంబులును, సుందరాంగనాంబులును, చెంగుచెంగున బోవు యాడుహారిణముపలె నొయ్యారంబుగఁ బోవు జవరాండ్రములను, సమస్త దేశపరిపాలనంబును మొదలగునవి యనుభవింపఁబడును. అట్టి పుణ్యకర్మము తీఱిపోయినేని వెంటనే యివరకుండిన భోగ భాగ్యంబులన్నియు మన్మథకేళియందు దారము తెగి నలుగడల చెదిరిపోయిన ముత్యములవలె నశించును.

శ్లో. గుణవ దగుణవ ద్వా కుర్వతా కార్యమాదౌ
పరిణతి రవధార్యా యత్నతః పండితేన
అతిరభస కృతానాం కర్మణా మావిపత్తే
ర్భవతి హృదయదాహీ శల్యతుల్యో విపాకః. 96

తే. గీ. సగుణ నిర్గుణ కార్యముల్ ♦ సలుపు సుమతి
చేతఁ బరిణతిగనుఁ బ్రీతి ♦ క్షింపఁ దగును
బరుష కర్మ విపాకంబు ♦ ఫలముదనుక
హృదయము దహించుశల్యంబు ♦ నిజము జగతి. 96

తా. బుద్ధిమంతుఁడు తానొకకార్యముఁ జేయ సంకల్పించినతఱి యాకార్యమున కెట్టిఫలము కలుగునో యాలోచింపవలయును. అట్లాలోచింపకుండ తొందరపడి చేసి నచో నరిమరణకాలమువరకు శల్యమువలె మనస్సు దహించునట్లుగాఁ పరిణమించును.

శ్లో. స్థాల్యాం వైడూర్యమయ్యాం పచతి తిలఖలం చాన్దనైరిన్ధనౌఘైః
సౌవర్ణైర్లాంగలాగ్రైర్విలిఖతి వసుధా మర్కతూలస్య హేతోః
ఛిత్త్వాకర్పూరఖండాన్ వృతిమిహకురుతే కోద్రవాణాంసమంతాత్
ప్రాప్యేమాం కర్మభూమింనభజతి మనుజో యస్తపోమందభాగ్యః.

మ. చెలువౌ రత్నఘటంబు సందతఁడు సు ♦ శ్రీఖండ ఖండంబులం
దిలపిణ్యాకము వండె నారుగల క ♦ ట్టిన్ సప్తపర్ణావృతుల్
నిలిపెన్ జిల్లెడు దూదికై పుడమి దు ♦ న్నెన్ బైఁడినాఁగేళ్ళని
మ్ములఁ గర్మక్షితిఁబుట్టి యెవ్వఁడు దపం ♦ బుల్ సేయఁ డపాత్రిజ్ఞ
తన. 97

తా. కర్మ జేయుటకుఁ దగినభూమిని బ్రాపించియు ఎవఁడు కర్మ యాచరింప డో యాతఁడు, మట్టిపాత్రతో వండదగిన తెలగపిండిని రత్నములచే నిర్మింపబడిన పాత్రతో వండువానితోను, పనికిమాలిన జిల్లెడుప్రేళ్ళకొరకు బంగరునాఁగేళ్ళతో భూమిని దున్నువానితోను మంచిగంధపుతరువులనరికి వానితో వాళ్ళకు వెలుగు వేయు వానితోను పోల్పబడును.

శ్లో. నైవాకృతిః ఫలతి నైవ కులం న శీలం
విద్యాపి నైవ నచ యత్నకృతాపి సేవా
భాగ్యాని పూర్వతపసా ఖలు సంచితాని
కాలేఫలంతి పురుషస్య యథైవవృక్షాః. 98

తే. గీ. రమ్యరూపంబు విద్యయు ♦ రాజసేవ
కులము శీలంబుఁ జాలవు ♦ ఫల మొసంగఁ
బూర్వ పుణ్య సంచిత భాగ్య ♦ ములు ఫలించుఁ
గాలమునఁ బనసాది వృ ♦ క్షముల కరణి. 98

తా. పురుషునకు అందముగాని, విద్యగాని, గుణము సేవించుటవలనగాని, మంచి కులముచేతగాని, సుశీలము వలనగాని, అంత్యపశ మంచి ఫలమొసగ నేరవు. పూర్వ జన్మంబునఁ జేసినపుణ్యమే కాలమున వనసాగి వృక్షములవలెనే ఫలమొసంగును.

శ్లో. మజ్జత్వంభసి యాతు మేరు శిఖరం శత్రూన్ జయత్వాహవే
వాణిజ్యం కృషిసేవనాది సకలా విద్యాః కలాః శిక్షతాం,
ఆకాశం విపులం ప్రయాతు ఖగవత్కృత్వాప్రయత్నంపరం
నాభావ్యం భవతీహ భాగ్య వశతో భావ్యస్య నాశః కుతః. 99

చ. సలిలముఁ జొచ్చిసంగరవి ♦ శైలముఁ జేరిన వైరివీరులన్
గెలిచినరాజసేవఁదిల ♦ కించినవేగము లభ్యసించినం
గళలతెఱంగెఱింగినఖ ♦ గత్వముఁ దాల్చిన గర్మవిఘ్నతా
కలన నభావ్యమైన పని ♦ గాదు వినాశము లేదు భావికిన్. 99

తా. ఏమనుజుఁడైనను నీటియందు జొచ్చినను మేరుపర్వత మెక్కినను రణంబున వైరివీరుల గెలిచినను, ప్రభుసేవ జేసినను చతుర్వేదముల నామూలాగ్రముగ దెలిసికొనినను సమస్తకళల నెఱింగినను ప్రయత్నించి పక్షివలె నాకాశమున నెగిరినను కర్మ వశంబగుటవలన భావ్యముకాని పనికాకుండగనే యుండును రాబోవున దయి తీరును.

శ్లో. వనే రణే శత్రు జలాగ్ని మధ్యే
మహార్ణవే పర్వతమస్తకేవా
సుప్తం ప్రమత్తం విషమస్థితంవా
రక్షంతి పుణ్యాని పురాకృతాని. 100

క. కాననమున రణమున సలి
లానల రిపు మధ్యమమున మహాబ్ధి నగాగ్ర
స్థానమున మత్తు నిద్రితుఁ
బూనికతోఁ బూర్వ పుణ్య ♦ ములు రక్షించున్. 100

తా. ఎవఁడయినను తొల్లిజన్మంబున నేమయినఁ బుణ్యమాచరించినచో, యాతఁడు భీకారణ్యములందు సంచరించినను, మహాసంగ్రామములో బోరుచుండినను, అగ్నిజ్వాల మధ్యనుండినను, లోతైన నీటిప్రదేశమం దుండినను, శత్రువులనడుమ చిక్కుబడినను, కొండశిఖరమం దున్నను, నిదురించు చున్నను. వాని పూర్వపుణ్యములు వాని కేయప కారము గలుగకుండ గాపాడును.

శ్లో. భీమం వనం భవతి సత్య పురం ప్రధానం
సర్వోజనః సుజనతా ముపయాతి తస్య
కృత్స్నాచ భూర్భవతి సన్నిధి రత్న పూర్ణా
యస్యాస్తి పూర్వ సుకృతం విపులం నరస్య. 101

తే. గీ. భువనమునఁ బూర్వ సంభృత • పుణ్యరాశి
యగుచు నుదయంబు గాంచిన • సుగుణ నిధికి
వనము పురమగుఁ బరులాత్మ • జనములగుదు
రవని నిధిరత్న పరిపూర్ణ • యయి ఫలించు. 101

తా. ఎవఁడు పురాకృత పుణ్యము గలిగినవాఁడో యాతనికి సింహ శార్దూలాది భీకర వన్యమృగములతో గూడిన యరణ్యమొక మహాసౌందర్యమగు పట్టణముగాను, శత్రువులందరును మిత్రులుగాను నగుదురు. మఱియు యాతని భూమి రత్నగర్భమై యుండును.

మ. యమునా నీల సరోజ సౌరభ రస • వ్యాసంగి భృంగీనిలో
పము కంఠద్యుతి లిప్త శేష భుజగ • ప్రాలంబ జాంబూనదా
ద్రి మహాకార్ముక రూఢగూఢ పదమా • ర్గీసంప్రయుక్త త్రివి
క్రమశాతాంబక పాతితాంబర చర • క్రవ్యాత్పురాట్పాలకా.

మాలిని. ప్రథమగణపరీతా • పాపజీమూత వాతా
కమలభువనసూతా • గణ్యలీలాకిరాతా
శమితదనుజ నేతా చారువక్త్రాంబుజాతా
సమరజయసమేతా • సామవేదాంతగీతా.

క. సుమనో నాయక సంభృతి
సుమనోర్చిత పదబిసప్ర • సూనభవానీ
సుమనోహార సురసిర్ఘ్ర ర
సుమనోదామార్ద్ర జాట • జూటోద్దేశా.

గద్య ము.

ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్ష వీక్షాపాత్ర చేనుఁగు
లక్ష్మణకవిరాజపౌత్ర తిమ్మనార్యపుత్ర విద్వజ్జన
విధేయ లక్ష్మణకవి నామధేయ ప్రణీతంబయిన
సుభాషిత రత్నావళి కావ్యంబునందు నీతి
శతకంబున మూర్ఖాది దశప్రకరణం
బులు గల ప్రథమాశ్వాసము.

సుభాషిత త్రిశతియందు నీతిశకము సంపూర్ణము.

శ్రీ ర స్తు.

# శృంగారశతకము.

## 1 స్త్రీప్రశంస.

—అవతారిక—

యోగీశ్వరుఁడగు భర్తృహరి, నీతిమాని శృంగారమును సేవించఁ గూడదు. కావున శృంగారశతకమునకు ముందు నీతిశతకమును వర్ణించి యున్నాఁడు. వైరాగ్యమునకు విరుద్ధమైనదియు శృంగారానంతముఁ వైరాగ్యము గలుగునుగాన యిప్పుడు శృంగారశతకము జెప్పుచు శృంగారమున కధిదేవతయగు మన్మధునకు నమస్కారము చేయుటయను నమస్కార రూపమంగళముతో లుత నాచరించుచున్నాఁడు.

శ్లో. శంభు స్స్వయంభు హరయో హరిణేక్షణానాం
యేనా క్రియంత సతతం గృహ కర్మదాసాః
వాచామ గోచర చరిత్ర విచిత్రితాయ
తస్మైనమో భగవతే కుసుమాయుధాయ. 1

ఉ. శంకర పద్మగర్భ ముర ♦ శాసనులఁ భువనేశులన్ నిరా
తంక ధృతిన్ మృగాక్షులకు ♦ దాసులఁ జేసిన మేటికింగురం
గాంక వసంత మిత్రునకు ♦ నంజలిఁ జేసెద వాగతీత ని
శ్శంక చరిత్ర చిత్రునకు ♦ షడ్గుణ హారికి శంబరారికిఁ. 1

తా. సృష్టి స్థితిలయ కర్తలగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను గూడ వనితాజనములకు వశులుగా జేసిన సందేహము లేనిదియు వచింపశక్యము గానిదియునగు గమనం

బున జితింపబడినట్టియు పద్మసంహారియు శంబరాసురునకు వైరియును, శృంగారమున కధిదేవతయునగు యామన్మథరాజునకు వందనమాచరించు చున్నాను.

శ్లో. స్మితేవ భావే నచ లజ్జయాభియా
పరాఙ్ముఖైః రర్ధకటాక్ష వీక్షణైః
వచోభి దీర్ష్యా కలహేన లీలయా
సమస్త భావైః ఖలుబంధనం స్త్రియః. 2

చ. చెలువపుఁ దేట లేనగవు ♦ చేతను భావముచేత సిగ్గుచే
నలువగు లీలచేత నుగు ♦ ణంబులచేఁ గడఁగంటి చూపుచేఁ
గలహముచేత విందులగు ♦ కందువ మాటలచే ననూయచేఁ
బలుచన నెంత వారివల ♦ పింతులు కాంతులు పెన్మ్భ్రమించలన్ .2

తా. సౌందర్యము లోలోను జిరునవ్వుచేతను, [illegible] సొంపుగు వయ్యారముల చేతను లజ్జచేతను సొంపగు [illegible] చేతను [illegible] చెల్వు నేత్రాంతపు చూపులచేతను [illegible] ముద్దులు మూటగట్టు మాటలచేతను ఓర్వలేమి వలనను, యిదియదియ [illegible] సమస్త భావంబులచేతను యువతులు యువకులను వశపర్చుకొందురు.

శ్లో. భ్రూచాతురాత్కుంచితాక్షాః కటాక్షాః
స్నిగ్ధా వాచో లజ్జితాంతాశ్చ హాసాః
లీలామందం ప్రస్థితం చ స్థితం చ
స్త్రీణా మేత ద్భూషణం చాయుధం చ. 3

తే. గీ. భ్రూలతాక్షేప కుంచిత ♦ స్ఫురణఁ దాల్చు
కలికి చూపులు నెయ్యంపుఁ ♦ బలుకుఁ దీపు
సిగ్గునగవులు చెన్నగు ♦ చిన్నడలు
భామ్మలాయుధములుముద్దు ♦ గుమ్మలకును. 3

తా. లతలనుబోలు కనుబొమలు నీటుగాద్రిప్పి యోరగా జూచు చూపులు, [illegible] [illegible] చేరన్ను

లును హంసవలె మందగమనములు వనితల కాయుధములును భూషణములుగాను గూడ వగును.

శ్లో. క్వచి త్సభ్రూభంగైః క్వచిదపిచలజ్జాపరిగతైః
క్వచి ద్భీతిత్రస్తైః క్వచిదపిచ లీలా విలసితైః
కుమారీణా మేభిర్మదనసుభగైర్నేత్ర వలితైః
స్ఫురన్నీలాబ్జానాం ప్రకరపరికీర్ణా ఇవదిశః. 4

ఉ. భ్రూలతికావిభంగయుత ♦ ముల్ సభయంబులు సత్రపంబు లు
ద్వేల విలాసముల్ మదన ♦ దీపనముల్ రుచిరంబులైన కాం
తా లనమాననేత్ర వలి ♦ తంబులచే దిశలెల్ల విస్ఫుర
న్నీల సరోజ పత్రములు ♦ నిండెననం గనుపట్టు నెంతయున్. 4

తా. తీగలవలె చలించెడి కనుబొమలుగలిగి నునుసిగ్గును గలిగి సింగమునుజూచి బెదరుచుండు హరిణమువలె తత్తరపాటును విలాసముతో గూడినట్టియు మన్మథోద్రేకముచే నింపబడినదియు కాంతిగలదియు స్త్రీల నేత్రాంతములచే నావరింపబడినదియు, వగుటవలన దిశ లన్నియు బాగుగా విడిచినట్లు నల్లగలువలు వెదజల్ల బడినటుల కానుపించెడిని.

శ్లో. వక్త్రం చంద్రవికాసి పంకజపరీహాసక్షమేలోచనే
వర్ణః స్వర్ణ మపాకరిష్ణు రలినీ జిష్ణుః కచానాం చయః
వక్షోజా విభకుంభ విభ్రమహరౌ గుర్వీ నితంబస్థలీ
వాచాం హారిచ మార్దవం యువతిషు స్వాభావికం మండనం. 5

ఉ. తమ్ముల నేలుకన్నులు సు ♦ధానిధిఁ బోలుమొగంబు మత్తభృం
గమ్ములగెల్చు కొప్పు కన ♦ కద్యుతి మీఱుమెయుంగు కుంభి కుం
భమ్ముల నవ్వుగుబ్బచను ♦ బంతులు గొప్పపిఱుందు తేనియ
ల్చిమ్మెడు ముద్దుఁబల్కులును ♦ జేయనిసొమ్ములుసుందరాంగికిన్. 5

తా. పూర్ణచంద్రుని ధిక్కరించు ముఖంబును, తెల్లదామర రేకులను నిరసించు నేత్రములును, పదారువన్నె బంగారపు ఛాయను ధిక్కరించు మేనికాంతియు, ఏనుగ కుంభస్థలమువంటి గబ్బిగను గుబ్బలును, బరువగునవియు పెద్దపెద్దవగు పిఱుదులును, తేనెలొలుకు ముద్దుమాటలును, గండుతుమ్మెదల రెక్కల నిరసించు నెరికురులును అనునవియే స్త్రీలకు ధరింపని యాభరణములు.

శ్లో. స్మితం కించి న్ముగ్ధం సరళతరలో దృష్టివిభవః
పరిస్పందో వాచామభినవవిలాసోక్తిసరసః
గతానా మారంభః కిసలయితలీలాపరికరః
స్పృశంత్యా స్తారుణ్యం కిమువ హి న రమ్యం మృగదృశః. 6

ఉ. ఇంచుక ముద్దు లేనగవు ♦ లింపగు నవ్యవిలాససూక్తు ల
భ్యంచిత లోలదృష్టియు న ♦ వారణ పల్లవమండలంబుని
ర్మించు సలీల యానములు ♦ మేలుగ యౌవనలక్ష్మితోడ న
ర్తించు మృగాక్షిచందముల ♦ ప్రమదంబు ఘటింప జాలవే. 6

తా. ముద్దుల మూటగట్టు చిఱునవ్వులును, సుశ్లోకరంబులైన సూక్తులతో, నొప్పువాక్యంబులును, చలించెడి చూపులును, క్రొత్తవియు, నెఱ్ఱనియునగు చిగుళ్ళను విలాసముతో గూడిన నడకలును, నవయౌవనముతో గూడిన వనితల నేక విధంబుల నానందాంబుధిలో నింపకుండుదురా?

శ్లో. దృష్టవ్యేషు కిముత్తమం మృగదృశః ప్రేమప్రసన్నం ముఖం
ఘ్రాతవ్యేష్వపి కిం తదాస్యపవనః శ్రావ్యేషు కిం తద్వచః
కిం స్వాద్యేషు తదోష్ఠపల్లవరసః స్పృశ్యేషు కిం తద్వపు
ర్ధ్యేయం కిం నవయౌవనే సహృదయైః సర్వత్ర తద్విభ్రమాః. 7

సీ. ముఱిపెంగఁ బగిస వ ♦ స్తువులందు ఘనమగు
తులలేక తగు వెలం ♦ దుల మొగంబు
వలపు గ్రైకొనఁదగు ♦ వానిలో నెయ్యది
మగువల పదనొజ్జ ♦ మారు తంబు

వీనుల కింపైన ♦ వానియం దెయ్యది
కోమలాంగుల ముద్దు ♦ గులుకు పలుకు
తనువుసోకిన సుఖం ♦ బొనరించు నెయ్యది
మెలతల సొబగైన ♦ మేను దీవ

తే. గీ. యతివ ధురమెద్ది కాంతాధ ♦ రామృతంబు
సరసజనులకుఁ జింతింప ♦ జాలునెద్ది
పువ్వుఁబోఁడుల వెలలేని ♦ జవ్వనంబు
వెలయునెల్లెడఁ బడఁతుల విభ్రమములు. 7

తా. రసికత్వ మెఱింగినవారు, ప్రేమలుట్టిపడ పూర్ణచంద్రునివంటి మొగము కల జవరాలికంటెఁ జూడదగినదియు, సుందరాంగుల తెలిముద్దు మొగంబుననుండి వీచు కమ్మతెమ్మెరలకంటె మూర్కొన దగినదియు మధారసంబు లొలుకు జవరాలి ముద్దుఁ బలుకుకంటె వినదగినదియు, యౌవనాంగియొక్క దొండపండువంటి యధరపానంబు కంటె గ్రోలదగినదియు, కోమలాంగుల నునుతీగలవంటి మేనుకంటె స్పృశింపదగినది యు, వనితా అవయావనముకంటెను దాన్నికంటె యన్నియెడలను దానియొయ్యారంపు గులుకులకంటెను మించిన వేవియును లేవని జెప్పుదురు.

శ్లో. ఏతా శ్చలద్వలయసంహతి మేఖలోత్థ
ఝంకారనూపుర వారహృత రాజహంస్యః
కుర్వంతి కస్య న మనో వివశం తరుణ్యో
విత్రస్త ముగ్ధహారిణీసదృశైః కటాక్షైః. 8

మ. కరచంచన్మధికంకణక్వణరణ ♦ త్కాంచీగుణాస్వర్ణనూ
పురనాదాహృతరాజహంసరమణుల్ ♦ పూర్ణేందుబింబాననల్
ధర నెవ్వానిమనంబు సేకొనరు ము ♦ గ్ధత్రస్త వల్గన్మృగీ
తరళాలోకనతుల్యవిభ్రమదృగం ♦ తస్తోమపాదంబులన్. 8

తా. మణులు స్థాపింపబడిన కంకణములు చేతియందుండి కంగుమని మ్రోగు చుండ, మొలనూలి బంగారపుచిరుగజ్జెలు ఝణం ఝణాధ్వనులు సేయ, అందియలు గల్లు

గల్గుమని మ్రోయు మురిపెంపునడకలతో పూర్ణచంద్రునివంటి ముఖంబుగల జవరాండ్రు. భయంబుచే బెదరిన యాడుహరిణంపు చూపులం జూచెడి సుందరాంగు లెట్టివారినైన వశవరచుకొందురు.

శ్లో. కుంకుమపంకకళంకితదేహా
గౌరపయోధరకంపితహారా
నూపురహంసరణత్పదపద్మా
కం న వశీ కురుతే భువి రామా. 9

చ. గొనబగుమేన సంకుమద ♦ కుంకుమపంక మెసంగ సిబ్బెపుం
జనుఁగవ రత్నహారములు ♦ సారెపెనంగఁ బదాంబుజంబులన్
మొనసిన గిల్కుటందియల ♦ మ్రోఁతచెలంగ నసంగ వైభవం
బెనయఁ గగుల్కు కల్కి సొబ ♦ గెవ్వనిఁ దావలపింప దిమ్మహిన్.

తా. కుంకుమ, పునుగు, జవ్వాది పరిమళద్రవ్యంబులతో మెయినిండ దట్టముగ వలందుకొని, చక్రంబులవలెనుండు గబ్బిగుబ్బలపై ముత్యపుసరులల్లాడుచుండగా, కెందమ్ములబోలు పాదంబులందలి యందెలు అంచరొదలువలె నింపుగులుక, అందంబున కాటపట్టయిన రతీదేవిని తిరస్కరించు జవరాండ్రకు వశులు గాని వారెవ్వరు?

శ్లో. నూనం హి తే కవివరా విపరీత వాచో
యే నిత్య మాహు రబలా ఇతి కామినీస్తాః
యాభి ర్విలోలతర తారకదృష్టిపాతైః
శక్రాదయోపి విజితా స్త్వబలాః కథంతాః. 10

చ. అతివలఁ జూచి వీ రబల ♦ లంచు వచించుమహాకవీంద్రు లు
ద్ధత విపరీతవాదు లిది ♦ దబ్బరగాదు విలాసినీ నమం
చిత తరళాక్షిపాతములచే ♦ గెలువంబడి రింద్రముఖ్యులున్
ధృతి నటువంటి వారబల ♦ లేగతినైరి తలంచి చూడగన్. 10

తా. జవరాండ్రఁజూచి కవీశ్వరులు అబల లందురు. వారిమాటలం దంతయు నబద్ధమే యున్నది. కానిచో బెదరిన బిత్తరి జింకవలె చంచల నేత్రములు గలిగి నల్ల

ఋగ్విద్యు నొయ్యారముగా దిగ్విప్పుచు యోరచూపులచే ఇంద్రాది ప్రముఖులను దమ వశముచేసికొనిన బాలలురాం డబిబల లెట్లయిరి? కనుక కవులు విపరీత వాదులనియే జెప్పవలెను.

శ్లో. నూన మాజ్ఞాకర స్తస్యాః
సుభ్రువో మకరధ్వజః
యత స్తన్నేత్రసంచార
సూచితేషు ప్రవర్తతే. 11

క. నారీజనముల కాజ్ఞా
కారియగుభటుండు మరుఁడు ♦ గాఁబోలుఁ జుమీ
వారి కటాక్షము సోఁకిన
వారియెడన వాఁడిజూపి ♦ వర్తించుఁ గదా. 11

తా. మన్మధుఁడు సుందరాంగుల చూపులు ప్రసరించినతోడనే తనప్రతాపముఁ జూపుచున్నాడు. కావున స్త్రీలకు మన్మధుఁడు కింకరుడనియే జెప్పవలయును.

శ్లో. కేశాస్సంయమిన శ్శ్రుతే రపిపరం పారంగతే లోచనే
అంతర్వక్త్ర మపిస్వభావ శుచిభిః కీర్ణం ద్విజానాం గణైః
ముక్తానాం సతతాధివాసరుచిరౌ వక్షోజ కుంభావిమౌ
విత్థం తన్వి వపుః ప్రశాంతమపితే రాగం కరో త్యేవ నః. 12

ఉ. వావిరి కన్నుదోయి శ్రుతి ♦ పారగ మెంతయు సంయముల్ కురుల్
భావ శుచిద్విజ ప్రకర ♦ భాజన మెన్న ముఖాంతరంబు ము
క్తావళి రమ్యముల్ కుచము ♦ లక్కట యిట్లు ప్రశాంతమయ్యురా
జీవదళాక్షి మేను విర ♦ చించుచు నున్నది మాకురాగముఁ. 12

తా. ఓలతాంగీ! ముడువబడిన నెఱికురులు శ్రుతిపారముఁ జెందిన నీ నేత్రములు నీముఖములోపల సహజముగా శుచిగలపండ్లువరుసలు ముక్తాహారములచే నిండింపబడిన నీగబ్బిగుబ్బలపాలిండ్లు, గలిగి మనోహరంబయి మాకనురాగమును కలిగించుచున్నవి.

శ్లో. ముగ్ధే ధనుష్కతా కేయ
మపూర్వా త్వయి దృశ్యతే
యయా విధ్యసి చేతాంసి
గుణై రేవ సాయకైః. 13

క. శరీరములచే భేదింపక
నిరతముఁ జేసెదవు హృదయ నిర్భేదము భా
సురగుణములచే నద్భుత
కరచాప ప్రౌఢి నీకె కలదు లతాంగీ. 13

తా. తీఁగబోఁడీ! శరములచే భేదింపక రూప యౌవనాది గుణములచేత నిత్య ము హృదయమును బాధించుచున్నావు. కనుక వింతయగు విలువిద్యాప్రవీణత నీయం దున్నయది.

శ్లో. సతి ప్రదీపే సత్యగ్నౌ
సత్సు తారారవీందుషు
వినా మే మృగశావాక్ష్యా
తమోభూత మిదంజగత్. 14

ఆ. వె. పెక్కు దివియలున్న ♦ జక్కవచెలియున్న
రిక్కరాయఁడున్న ♦ జుక్కలున్న
జిన్నిలేడి చూడ్కిచేడె ♦ య నెడఁబాయు
నప్పు డంధకార ♦ మయ్యె జగము. 14

తా. మహాతేజోవంతుడగు సూర్యుడున్నను, చీకటుల నడచు నక్షత్రములు చంద్రుడున్నను లేడిపిల్లలవంటి బెళుకుచూపులుఁ గా చెడి నావగలాడి లేనప్పుడు ప్రపంచమంతయు చీకటిగానే యున్నట్లుఁ దోచుచున్నది.

శ్లో. ఉద్వృత్తః స్తనభార ఏష తరళే నేత్రే చలే భ్రూలతే
రాగాధిష్ఠిత మోష్ఠపల్లవ మిదంకుర్వంతు నామవ్యథామ్

సౌభాగ్యాక్షరపంక్తికేవ లిఖితా పుష్పాయుధేన స్వయం
మధ్యస్థాపి కరోతి తాప మధికం రోమావలిః కేనసా. 15

చ. గరువపుఁ జన్నులుం బెళుకుఁ • గన్నులు నిల్కడలేని కన్బొమల్
మురియుచు నెఱ్ఱఁబారు జిగి • మోవియుఁ దాపముఁజేయఁగాదగున్
స్మరలిఖితోరుభాగ్యలిపి • జాలమనందగు మధ్యవర్తియై
పరఁగిన రోమరాజియును • బాయక తాపముఁ జేయనాయమే. 15

తా. పటువగు గబ్బిగుబ్బలును, వక్రకాళములగల నేత్రములును, సదాచలించు కనుబొమలును, మఱిపెమున నెఱ్ఱబారిన యధరంబును తాపముచేయగా దగిన మన్మధునిచేత వ్రాయబడిన భాగ్యరేఖయనదగు మధ్యనున్న నూగారుకూడ తపింప జేయును గాదా!

శ్లో. ముఖేచ చంద్రకాంతేన
మహానీలైః శిరోరుహైః
కరాభ్యాం పద్మరాగాభ్యాం
రేజే రత్నమయీవ సా. 16

తే. గీ. మిగుల శశికాంతమైన నె • మ్మొగము చేత
నెఱి మహానీల రుచులైన • నెఱుల చేత
జలజరాగము లయినహ • స్తములచేత
రత్నమయ మనఁ గామినీ • రత్న మమరె. 16

తా. ఆముద్దులాడి మొగము చందురినితో సమానమయినది. దాని కురులు నీలమును ధిక్కరించుచున్నవి. దానికరములు పద్మములవలె నెఱ్ఱవయినవి. కావున యాపె రత్నములచేఁ జేయబడిన కాంతారత్న మనబడుచున్నది.

శ్లో. గురుణా స్తనభారేణ
ముఖచన్ద్రేణ భాస్వతా
శనైశ్చరాభ్యాం పాదాభ్యాం
రేజే గ్రహమయీవసా. 17

క. గురువగు కుచభారంబును
సరస కళాభాస్వ దాస్య ♦ చంద్రుండు శనై
శ్చరము లగుచరణములుఁ గల
కరిగమన దనర్చెనౌర ♦ గ్రహారూప యనన్.  17

తా. వనితల స్తనములు భారమగునవి. సూర్య చంద్రులఁ బోలు మొగంబుగల వారు. మంద గమనములుగల పాదములు. కాబట్టి యావనితలు గ్రహములచే చేయబడి నటు లున్నారు.

శ్లో. తస్యాః స్తనౌ యదిఘనౌ జఘనంచ హారి
వక్త్రంచ చారుతవ చిత్తకిమాకులత్వమ్
పుణ్యం కురుష్వయది తేషు తవాస్తివాంఛా
పుణ్యై ర్వినా నహి భవంతి సమీహితార్థాః.  18

చ. సుదతి పయోధరంబు లతి ♦ సుందరముల్ జఘనంబు రమ్యమా
వదనము హృద్యమంచుఁ జల ♦ వర్తనమేటికి నీకుఁ జిత్తమా
కదలక వానిపైఁ దలఁపు ♦ గల్గినఁ బున్నెము లాచరింపు మిం
పొదవ లభించునే సుకృత ♦ యోగము లేక సమీహితార్థముల్.18

తా. ఆలతాంగి జిగిబిగిగనున్న గబ్బిగుబ్బల పాలిండ్లం జూచియు, ముద్దులొలుకు దాని ముఖంబుఁజూచియు, ఓ మానసమా! నీవూరటజెందిన బనియేమి యున్నది. పుణ్యములు లేకపోయిన వాంఛితార్థములు కలుగవు గనుక వానియందు నీకుభోగేచ్ఛ యున్న పుణ్యము లాచరింపుము.

శ్లో. ఇమేతారుణ్యశ్రీ నవపరిమళాః ప్రౌఢసురత
ప్రతాప ప్రారంభా స్స్మరవిజయ దానప్రతిభువః
చిరం చేతశ్చోరా అభినవ వికారైక గురవో
విలాస వ్యాపారాః కిమపి విజయంతే మృగదృశామ్.  19

చ. కనఁదగు నిండుజవ్వనపుఁ ♦ గల్మికిఁ దావులు ప్రౌఢ సంగమం
బునకు నుపక్రమక్రియలు ♦ పుష్ప ధనుర్జయ దానదక్షవా

ఙ్మనసిజ చిత్తహారులు వి • కారనిదానములైన కామినీ
జనుల విలాసకృత్యములు • సంతత రమ్యతరంబు లెన్నఁగన్. 19

తా. హరిణ నేత్రములవంటి నేత్రములుగల జవరాండ్ర శృంగారపు చేష్టలు, వారి యౌలజవ్వనంపు సొంపును, తొల్త వెలువరించునవియు, మన్మథునకు జయము నిచ్చు కార్యశీఘ్రముగలమాటలును, కందర్పునిరీతి మనంబుల హరించునవియు నాశ్చర్యములకు మొదటికారణములయిన స్త్రీ విలాసంపదల నాలోచింపగా మిగుల మనోరంజకములయినవి గదా!

శ్లో. ప్రణయమధురాః ప్రేమోద్గారా రసాశ్రయతాం గతాః
ఫణితిమృధురా ముగ్ధప్రాయాః ప్రకాశిత సంమదాః
ప్రకృతి సుభగా విస్రంభార్ద్రాః స్మరోదయ దాయినో
రహసి కిమపి స్వైరాలాపా హరంతి మృగీదృశాం. 20

చ. ప్రణయశ్రీ మధురంబులుజ్జ్వల రస • ప్రాచుర్యముల్ ప్రేమభూ
షణముల్ దర్శిత హర్షముల్ రుచిరవి•శ్వాసార్ద్రముల్ హృద్యముల్
ఫణితి ప్రావ్యము లంగజ ప్రభవముల్ • ప్రాణేశ్వరీ నర్మభా
షణముల్ నామదిఁగొల్లలాడెడి రహ • స్యక్రీడలం దెప్పుడున్. 20

తా. ప్రణయమను సంపదచే తీయనైనవియు, ప్రకాశవంతమగు రసంబుచే ప్రచురములైనవియు, అలంకారము అనురాగముగా గలదియు, చూచినతోడనే సంతోషించునవియు, నమ్మకంబుచే దడసినవియు, మన్మథోద్రేకముతో గూడిన ప్రియురాలి నగవుమాటలు నాహృదయంబును దాచదగిన వాక్యములచే హరింపబడినవి.

శ్లో. విశ్రమ్య విశ్రమ్య వనే ద్రుమాణాం
ఛాయాసుతన్వీ విచచార కాచిత్
స్తనోత్తరీయేణ కరోద్ధృతేన
నివారయంతీ శశినో మయూఖాన్. 21

చ. విరహకృశాంగియైన ఘన • వేణియొకర్తు వనంబులోపలం
దరువుల నీడలందు నుచి • తంబుగ మాటికి విశ్రమించి బం

ధురగతి సంచరించెఁ జను ♦ దోయిని బయ్యెదకొంగుఁ గేలఁదా
వెరవుగఁ బూని యగ్గలపు ♦ వెన్నెలకాఁక దొలంగఁజేయుచున్. 21

తా. ఒకవనములో నొకానొక లతాంగి విరహతాపమున గృశించి వేడుకగా విహరింపవచ్చి యందు గాయు వెండువెన్నెల వేఁడిమికాగలేక పైటచెరంగునెత్తి యది తనకుసోకకుండ నడ్డముగా బెట్టుకొని వెన్నెలలులేని చెట్లనడుగు నీడలం దప్పుడప్పుడు అలపుదీర్చుకొనుచు నందుఁ దిరుగుచుండెను.

శ్లో. ఆదర్శనే దర్శన మాత్రకామా
దృష్ట్వా పరిష్వంగ సుఖైకలోలాః
ఆలింగితాయాం పునరాయతాక్ష్యా
మాశాస్మహే విగ్రహయో రభేదమ్. 22

ఉ. బాలిక నన్నుఁ గన్గొనని ♦ పట్టునదర్శనమాత్ర మబ్బినం
జాలు నటంచుఁ గోరె మఱి ♦ చక్కఁగఁ గన్నుల నన్నుజూచి ప్రో
యాలు కవుంగిలింపవలె ♦ నంచుఁ దలంచెఁ దమిం గవుంగిటన్
మేలుగఁ జేర్చుకొన్న నిరు ♦ మేనులు నొక్కటిసేయఁగోరితిన్. 22

తా. ఒకవగలాడి నన్ను చూడనుండ యున్నంతకాలము చూపు కలిగిన చాలు నని తలంచితిని. దైవయోగంబువలన యామెనుఁ జూచుట తటస్థించె నేని యొకసారి కౌగలింపవలయునని దలఁచితిని. అదృష్టవశమున నావగలాడి బిగియార కవుంగలింప గలిగినప్పుడు మాయిరువురి మేనులు యేకమై యుండవలయునని దలఁచితిని. జవరాలి సౌఖ్యమునకు మితిలేనిది కావున యెంత యనుభవించినను దృప్తి గలుగదు.

శ్లో. మాలతీ శిరసి జృంభణోన్ముఖీ
చందనం వపుషి కుంకుమావిలమ్
వక్షసి ప్రియతమామనోహరా
స్వర్గ ఏష పరిశిష్ట ఆగతః. 23

చ. తలపయి మాలతీ కుసుమ ♦ దామము నెమ్మెయి గుంకుమంబుతో
గలసినకమ్మతావి విరి ♦ గందపుఁ బూఁత వెడందఱొమ్మున నం

దలికుల నీలకుంతల మ ♦ దాలస నీలసరోరుహాక్షియుం
గలుగుట నింద్రభోగమన ♦ గాఁ దగదే మఱివేఱె యున్నదే. 23

తా. శిరస్సునందు పరిమళముల విరజిల్లు మాలతీకుసుమదామము ధరించి, మై నిండ కుంకుమ, పునుగు మొదలగు వానితో నలదుకొనియు, ముఖంబున తుమ్మెద రెక్కలను నిరశించు ముంగురులును, గబ్బిగుబ్బల భారంబున మందత్వమును, నీలోత్ప లమును మించు నేత్రములు గలిగిన పూవుబోణితోడి సౌఖ్యముదొరకిన నింద్రభోగ మనియే తలంపవలయును.

శ్లో. ప్రాఙ్మామేతిమనా గనాగతరసంజాతాభిలాషం తతః
సవ్రీడం తదనుశ్లథీ కృతతను ప్రత్యస్త ధైర్యంపునః
ప్రేమార్ద్రం స్పృహణీయ నిర్భరః క్రీడాప్రగల్భం తతో
నిశ్శంకాంగ వికర్షణాధిక సుఖం రమ్యం కులస్త్రీ రతమ్. 24

ఉ. ఆది మితాదరం తద ♦ నంతర మంచితరాగమంత ల
జ్జోదయ రమ్యమంత శిధి ♦ లోద్యము మంత నితాంత ధైర్యవి
చ్ఛేదము ప్రేమపూరము వి ♦ శేషవివిక్త విహారమంత నా
హ్లాద కరాంగ సంగము కు ♦ లప్రమదారత మల్పసౌఖ్యమే. 24

తా. తొల్త మితాదరంబుగలిగి పిమ్మట గౌరవముతోగూడిన అనురాగమును మరియొక క్షణములో సిగ్గుచేగలుగు బుజ్జగింపుతనంబును, నంతలోనే ఖేదాభిప్రాయం బును మఱొకక్షణములో ధైర్యమును నంతలో రహస్యగతియు మఱికొంతకాలమునకు హృదయాహ్లాదకరంబగు శరీరసంయోగంబును గలిగించునట్టి కులకాంతపొందు స్వల్ప సౌఖ్యము గానేరదు.

శ్లో. ఉరసి నిపతితానాం స్రస్తధమ్మిల్లకానాం
ముకుళితనయనానాం కించిదున్మీలితానామ్
ఉపరి సురతఖేద స్విన్నగండస్థలానా
అధరమధు వధూనాం భాగ్యవంతః పిబంతి. 25

ఉ. అక్కునవ్రాలి కొప్పువిడి ♦ యల్లలనాడఁగఁ గన్నుదామరల్
చక్కఁగ మోడ్చి చొక్కు పురు ♦ షాయిత సంజనిత శ్రమంబు నం
జెక్కులు ఘర్మబిందువులు ♦ చిందఁగ వీఁదొనరించు బోంట్ల మే
ల్చొక్కపు మోవితేనె చవిఁ ♦ జూతురు భాగ్యము గల్గునేర్పరుల్.

తా. ఉరంబగు ఱొమ్మునవ్రాలి కొప్పువిడిపోయి యల్లలనాడుచు తెలిపద్మములబోలు నేత్రములు కొంతమూసి, యువసంభోగమువలన నలసినొలసి నున్న జెక్కులు చెమర్చ, హృదయానందంబు కలుగజేయు పూవుబోండ్ల యధరామృత సారం గొక్క పుణ్యవంతులకే దొరకును.

శ్లో. ఆమీలిత నయనానాం
యః సురత రసోను సంవిదంభాతి
మిథునై ర్మిథోవధారిత
మవిత థమితమేవ కామనిర్వహణమ్. 26

తే. గీ. కన్ను లరమోడ్చి విహరించు ♦ చున్నవారి
సురత భోగంబు తెలివితోఁ ♦ బరఁగె నేని
రమ్యమగు నిది కామ ని ♦ ర్వహణమనుచు
నాయికా నాయకులకు ని ♦ ర్ణయముగాదె. 26

తా. నేత్రములు సగము మాత్రమే మూసికొని ఏయువకీ యువకులు సురతంపు రసమును తెలివితో మానసంబు లందనుభవింతురో అదియే కామపురుషార్థముయొక్క సిద్ధియని రతిరాజ్యమేలిన నాయికా నాయకులచే నిశ్చయింపబడినది.

శ్లో. ఇద మనుచిత మక్రమశ్చ పుంసాం
యదిహ జ్వరాస్వపి మాన్మథా వికారాః
యదపి చన కృతం నితంబినీనాం
స్తనపతనావధి జీవితం రతం వా. 27

చ. ఇది యుచితంబుగానిపని ♦ యిమ్మహిలో మగవారి కెంతయుఁ
మదన సుఖాభిలాషములు ♦ మానకయున్కి జరాభరంబునం

గోదమ మిటారి ముద్దు చను ♦ గుబ్బలు జాఱిన వెన్క బోంట్లకుం
మదన సుఖంబు జీవితము ♦ మాన్పడు తామర చూలి జాణయే. 27

తా. మగవారికి వృద్ధాప్యమువచ్చినను, స్త్రీలకు ముద్దు చనుగుబ్బలు జాఱిన తరువాతను సంభోగేచ్ఛ గలిగించు బ్రహ్మ జాణయని చెప్పవీలులేదు.

శ్లో. రాజం స్తృష్ణాంబురాశే ర్నహి జగతిగతః కశ్చిదేవావసానం
కోవార్థో ర్థైః ప్రభూతై స్స్వవపుషిగళితే యావనే సానురాగే
గచ్ఛామస్సద్మయావ ద్వికసిత నయనేందీవ లోకినీనా
మాక్రమ్యా క్రమ్యరూపం ఝుడితిన జరయాలుప్యతే ప్రేయసీనాం.

శా. ఆశాసాగర పారమేరికిని శ ♦ క్యంబానే చేరంగ భో
గాశాయుక్తము జవ్వనంబు గళితం ♦ బైనన్ ధనంబేల ధా
త్రీశా యింటికిఁబోదుమే ప్రియవధూ ♦ హృద్యోల్లసద్రూపరే
ఖా శోభాతిశయంబా దుర్భరజరా ♦ క్రాంతంబు గాకుండఁగన్. 28

తా. ఆశయను మహాసముద్రము దాటనేరికి శక్యముగాదు. కావున భోగాశా సహితంబగు రూప యౌవనములు జాఱినవెనుక ధనముండిన మాత్రమేమి లాభము? కనుక రాజా! ప్రియకాంతల రూపరేఖా యౌవనాదుల వృద్ధాప్యముచే మాసిపోక మునుపే యింటికిబోయి మాజవరాండ్రతో సుఖముగా నుందుము.

శ్లో. రాగస్యాగారమేకం నరక శతమహాదుఃఖ సంప్రాప్తి హేతు
ర్మోహస్యోత్పత్తి బీజం జలధరపటలం జ్ఞానతారాధిపస్య
కందర్పస్యైకమిత్రం ప్రకటిత వివిధస్పష్టదోషప్రబంధం
లోకేస్మిన్నహ్యనర్థ వ్రజకులభవనం యౌవనాదన్య దస్తి. 29

చ. రతిపతిచేతి వాలు ఘన ♦ రాగవిలాసము నీతివైరి దు
ర్గతి శతదుఃఖ మోహజని ♦ కారణ ముజ్జ్వలబోధ తారకా
పతి నిబిడాభ్రబృందము శు ♦ భప్రతిబంధము దోషసంఘసం
గతమగు నేఁగి జవ్వనము ♦ కన్న జగంబున వేఱెయున్న దే. 29

తా. యౌవనము అనురాగము కలిగించును. నరక పరంపరలు కలిగించి దుఃఖముల పాలొనర్చును. పరకాంతాపహరణమున కుద్యుక్తునిజేయును. అజ్ఞానమును ప్రకాశింపజేసి మేఘములు చంద్రుని గప్పునట్లు జ్ఞానమును మరుగు పరచును. మన్మథవికారమునకు లోబరచును. పరికటితముగా పలుపాపములఁ జేయించును. ఇటువంటి కష్టములు కలిగించునది యౌవనముకంటె మఱియొక టీజగమందు లేదు.

శ్లో. శృంగార ద్రుమనీరదే ప్రిస్మరక్రీడా రసస్రోతసి
ప్రద్యుమ్న ప్రియబాంధవే చతురవాఙ్ముక్తాఫలోదన్వతి
తన్వీ నేత్ర చకోర పార్వణవిధౌ సౌభాగ్య లక్ష్మీ నిధౌ
ధన్యః కోపిన విక్రియాం కలయతే ప్రాప్తేనలే యౌవనే. 30

ఉ. మారుని కూర్మిచుట్టము స ♦ మంచిత కేళి రసప్రిదంబు శృం
గార మహీజ నీరదము ♦ కంజముఖీజన దృక్చకోర రా
కార జనీశమండలము ♦ కాంతవచోమణివార్ధి యౌవనం
బారయఁ జెందుచో వికృతి♦నందనివాఁడె కృతార్థుఁ డిమ్మహిన్. 30

తా. నీరునకు పారుపల్లవ రతికేళీరసము విచ్చలవిడిగ బ్రవర్తింపఁ జేయునదియు కూర్మిచుట్టమువలె కందర్పునకుఁ దోడై యుద్రేకింప జేయునదియు, సాగరము ముత్తియంబుల నీనునట్లు ముద్దులొలుకు నెఱజాణంపు మాటలను నీటు గలిగించునదియు, పూర్ణచంద్రుఁడు చకోరపక్షుల కుల్లాసము గలిగించునట్లు సుందరాంగుల కన్నుఁగవల కుల్లాసము గలిగించెడిదియు, ఆశ్చర్యమగు జక్కదనంపు సిరినిగిలుకొన జేయునదియు, నైన యౌవనము పొడసూపగా ధన్యుఁడెవ్వఁడో యొకఁడు విషయవాంఛ నొందక యుండునుగాని, యందఱట్లుండరు.

శ్లో. సంసారేస్మి న్నసారే కునృపతి భవనద్వార సేవాకళంక
వ్యాసంగ వ్యస్తధైర్యం కథ మమల ధియో మానసం సంనిదధ్యుః
యద్యేతాః ప్రోద్యదిందు ద్యుతిసిచయ భృతో నస్యు రంభోజనేత్ర
ప్రేంఖత్కాంచీ కలాపా స్స్తనభర వినమన్మధ్య భాజస్తరుణ్యః 31

చ. జలజ విలోచనంబులును ♦ సన్నపుఁ జందుర కావిచీరలుం
గులుకు మెఱుంగుఁ జన్నులును ♦ గొంచెపుఁ గన్నులు రత్నకింకిణీ

కల రశనా గుణంబులును ♦ గల్గిన కాంతలు గల్గరేని గా
సిలి మతిమంతులేటికి వ ♦ సింతురు రాజగృహాంగణంబులన్. 31

తా. వెల్లనైన తామరరేకులవంటి నేత్రములును, లేతచంద్రుని కీడువచ్చు సన్న
వగు బట్టలును, బలితంపు గుబ్బలును, వాలు కన్నులును, రతనములచే స్థాపింపబడిన
గంటలధ్వనితో కూడిన బంగారు మొలనూలును, కలిగినట్టిరమ్యరూపిణులగు జవరాండ్రు
లేనిచో భాగ్యవంతులును, బుద్ధిమంతులును రాజగృహంబులందు మతిలేకయుందురు.

శ్లో. సిద్ధాధ్యాసిత కందరే హరవృషస్కంధావరుగ్ణద్రుమే
గంగాధౌత శిలాతలే హిమవతః స్థానే స్థితే శ్రేయసి
కః కుర్వీతశిరః ప్రణామ మలినం మ్లానంమనస్వీ జనో
యద్విత్రస్త కురంగశాబనయనా నస్యు స్స్మరాస్త్రంయస్త్రియః. 32

శా. గంగాధౌతశిలాతలంబు హరగో ♦ స్కంధప్రదేశాహతో
త్తుంగక్ష్మాజము సిద్ధసేవిత గుహా ♦ స్తోమంబు శీతాచలో
త్సంగంబుండఁగ నెవ్వఁడోవు నృపహా ♦ దంబుల్ దలం దాల్పసా
రంగీ శాబవిలోచనల్ మనసిజా ♦ స్త్రంబుల్ సతుల్ లేనిచోన్. 32

తా. గంగాజలంబులచే దడుపఁబడిన రాతిప్రదేశములును, శివుని వాహనంబగు
నందీశ్వరునిచే బడగొట్టబడిన తరురాజంబులును సిద్ధసేవితంబగు కొండగుహలును కలి
గిన హిమపర్వతముండగాఁ నాడుహరిణచూపులవంటిఁ జూపులుగలిగి మన్మథాస్త్రం
బులవందగు నారీజనము లేకున్నచో రాజసేవ నెవడంగీకరించును?

శ్లో. సంసార తవపర్యంత
పదవీ నదవీయసీ
అంతరా దుస్తరానస్యు
ర్యది రే మది రేక్షణాః. 33

తే. గీ. అమిత సంసారనీమ ప ♦ ర్యంతపదవి
గతిదలంవ దవీయసి ♦ గాదుసూవె

యర్ధి నీలోనఁ గడవంగ ♦ నలవి గాని
ఖంజరీటాయతాక్షులు ♦ గలుగ రేని. 33

తా. ఓసారము లేని సంసారమా! నీపొలిమేరను జేరవలయునన్న నడుమనుండ రాంగులు దాటనీయకుండ నున్నారు. వారు లేకపోయినచో నీహద్దు యిప్పుడున్నంత దవ్వుగా యుండక సమీపమందే యుండును.

## 3 పక్షద్వయనిరూపణము.

శ్లో. దిశవనహరిణేభ్యోవంశకాండచ్ఛవీనాం
కబళముపలకోటిచ్ఛిన్నమూలంకుశానామ్
శకయువతికపోలాపాండుతాంబూలవల్లీ
దళ మరుణనఖాగ్రైః పాటితంవా వధూభ్యః. 34

చ. శిలమొన మూలముల్ చిదిమి ♦ చెన్నుగ వేణుశరీరకాంతిచే
లలితములైన దర్భకబ ♦ ళంబులు లేళ్లకు నిమ్ము కానలోఁ
గలితశకాంగనావిపుల ♦ గండవిపాండురనాగవల్లికా
దళముల గోళ్లఁ ద్రుంచి వని♦తాతతికైన నొసంగు మిమ్ములన్. 34

తా. ఓమనుజుఁడా! విరక్తికలవాడవైనచో, నడవికిఁబోయి బెదురులేక వచ్చెడి జింకలకు, వెదురుడొంకల ప్రభలచే రమ్యంబులగు, గఱికపోచలను, శిలాగ్రంబుల ఛేదించి మేఁతపెట్టుము. అనురక్తికలవాడవగుచో సంసారమందుండి ప్రియురాలకు రమ్యంబులగు నాడుచిలుక చెక్కిళులవలె నించుకధవళమగు తమలపాకులను గోళ్ళతో దుంచి యిమ్ము.

శ్లో. అసారాస్సంత్వేతే విరతివిరసా వాథ విషయా
జుగుప్స్యంతాం యద్వా నను సకలదోషాస్పద మితి
తథాప్యేత ద్భూమౌ నహి పరహితా త్పుణ్య మధికం
న చాస్మి న్సంసారే కువలయ దృశోరమ్యా మపరం. 35

చ. దురిత నిదానముల్ సకల ♦ దోషగృహంబులు సారహీనముల్
పరిణతి ఘోరముల్ విషయ ♦ పద్ధతు లెంతయు కుత్సితంబు లి

పులుఁగులు గాఁగ ధైర్యఖల ♦ భూజముఁ గూల్చుదురాశపేరి పు
ష్కలనది దాటి నిత్యసుఖ♦సంపద గాంతురు యోగిపుంగవుల్. 10

తా. కోరికలనెడి నీరుగల్గి దురాశయనెడి తరంగములచే గొట్టుచు ప్రేమలను మొసళ్ళుకలిగి వితర్కమనెడి పక్షితోఁగూడి, ధీరత్వమనే ఫలతరువుఁ బడగొట్టు దురాశయను మహానదిని దాటి యోగులు సదానందులగుదురు.

---

## 2 విషయపరిత్యాగవిడంబనము.

శ్లో. న సంసారోత్పన్నం చరిత మనుపశ్యామి కుశలం
విపాకః పుణ్యానాం జనయతి భయం మే విమృశతః
మహద్భిః పుణ్యౌఘై శ్చిరపరిగృహీతా హి విషయాః
మహాంతో జాయంతే వ్యసన మివ దాతుం విషయిణామ్. 11

చ. భవమున బుట్టు సత్క్రియలు ♦ భంబని చూడముపుణ్యకర్మగౌ
రవ ఫలమైన సంపద క ♦ రంబు భయావహమెన్ని చూచినం
బ్రవిమల పూర్వపుణ్యసము ♦ పార్జిత చందన ముఖ్యభోగ వై
భవమును భోగశీలుర క ♦ పాయముఁ జేయును వృద్ధిబొందెడున్.

తా. సంసారసాగరమందు జనించిన క్రియలు మంచివని తలంపుము. విచారణ చేసినచో పూర్వపుణ్యార్జిత ఫలమైన ఐశ్వర్యము చాలభయంకరమైన దగును. స్వచ్ఛమైన పూర్వపుణ్యానాశంబున నార్జింపబడిన సుగంధాదులు మొదలగు సుఖసంపద సౌఖ్యాపేక్ష గలిగింపును.

శ్లో. అవశ్యం యాతార శ్చిరతర ముషిత్వాపి విషయాః
వియోగే కో భేద స్త్యజతి న జనో యత్స్వయ మమూన్
వ్రజంతః స్వాతంత్ర్యా దతులపరితాపాయ మనసః
స్వయం త్యక్తా హ్యేతే శమసుఖ మనంతం విదధతి. 12

చ. ఉరుగతితోడ నేఁగు దడ ♦ వుండియు భోగము లట్టివానిఁ దా
నరుఁడు పరిత్యజింపఁడు క ♦ నంగన దద్వియహంబు భిన్నమే
పురుషుని భోగముల్ విడిచి ♦ భూరిమనోవ్యథ లాచరించు నా
పురుషుఁడె భోగముల్ విడిచి♦పొందునిరామయ శాంతి సౌఖ్యముల్.

తా. విషయ భోగములు చిరకాలమునుండి తమంతతామే విడిచిపోవును. అట్లు విడిచిపోవుటచే సంతాపము గలుగుచున్నది. పురుషుఁడు విషయభోగములు తనంత తాను విడిచెనేని వానిమానసవీథిని చరించెడి తృష్ణశాంతినొంది దానిచే మిక్కిలి సుఖమునంగును. కనుక విషయములు వాని యంతట నేవిడిచిచనుటకంటె పురుషుఁడా విషయసుఖములు వదలుట శ్రేయము.

శ్లో. బ్రహ్మజ్ఞానవివేకినో మలధియః కుర్వంత్యహో దుష్కరం
యన్ముంచ న్త్యుపభోగభాజ్యపి ధనా న్యేకాంతతో నిస్పృహాః
న ప్రాప్తాని పురా న సంప్రతి నచ ప్రాపౌ దృఢప్రత్యయా
వాంఛామాత్రపరిగ్రహాణ్యపి పరిత్యక్తుం న శక్తావయం. 13

చ. అనఘులు బోధపూర్ణులు మ ♦ హాత్ములు భోగనిదానమౌ మహా
ధనముఁ బరిత్యజింతురు గ ♦ తస్పృహులై పరమాద్భుతంబుగా
మునుపును బొంద కిప్పుడును ♦ ముట్టక యింకను జెందలేక నె
మ్మనమునఁ దోచుభోగముల ♦ మానఁగజాలముమేమొకింతయున్.

తా. సర్వసుఖములకాధారమగు ధనమును పరిత్యజించుట దుష్కరము. బ్రహ్మజ్ఞానముచే రంజిల్లువారు యట్టిదుష్కరమగు ధనపరిత్యాగముఁ జేయుదురు. మేమొంట్లను వెనుకధనసంపదలేదు. ఇప్పుడు ధనసంపదబ్బలేదు. ముందు కలుగువని నమ్మికలేదు. అందుచే యనుభవింపబడక మనస్సున కోరబడుచు మాత్రమేయుండుటచే విడువనశక్తులమై యున్నాము.

శ్లో. ధన్యానాంగిరికందరేషువసతాంజ్యోతిః పరంధ్యాయతా
మానందాశ్రు జలంపిబంతిశకునానిశ్శంకమంకేశయాః
అస్మాకంతుమనోరథోపరచిత ప్రాసాదవాపీతట
క్రీడాకానన కేళికౌతుకజుషామాయుఃపరిక్షీయతే.

చ. గిరిగుహాలన్ వసించి వృష ♦ కేతన చింతన మాచరించు స
త్పురుషుల సమ్మదాశ్రు కణ ♦ పుంజము గ్రోలుచునంకశయ్యలం
దిరవు గనుండు బక్షులు స ♦ మిద్ధమనః కృతసౌధ వాపికా
వరవన కేళిశీలురగు ♦ వారల కాయువె వీక్షితం బగున్. 14

తా. పర్వతగుహాలందు నిశ్చలుఁడై పరబ్రహ్మను భవజనితమైన యానందము వలన వచ్చుబాష్పవారి నొడిగుందు జంకులేరి వ్రాలి పక్షులు, తాగునంతటి నిశ్చలులై కాలముగడపు వారల యాయువే సార్థకము. మంచిమనస్సుచే మేడలు, చెరువులు, ఉద్యానవనములు మొదలగు వానిని గల్పించుకొని కల్లక్రీడ లనుభవించెడివారల యాయుర్దాయము నిరర్థకము.

శ్లో. భిక్షాశనం తదపి నీరస మేకవారం
శయ్యా చ భూః పరిజనో నిజదేహ మాత్రం
వస్త్రం సుజీర్ణ శతఖండమయీ చ కంథా
హాహా తథాపి విషయా న్న జహాతి చేతః. 15

చ. నిరతముఁ దిండి బిచ్చమగు ♦ నీరస మద్దియు నొక్క పూఁటయే
ధరణితలంబు సెజ్జ సత ♦ తంబును దోడు శరీరమాత్రమే
చెఱఁగుల చేరతున్క గమి ♦ చేత నమర్చిన బొంత పుట్ట మీ
కరణి మెలంగినన్ విషయ ♦ కాంక్ష లొకింతయుఁ బాయవక్కటా.

తా. సదా భిక్షాటనమే జీవనాధారము అదియు నొక్కపూటయే. భిక్షతిండి యైన రుచిలేనిది. భూమియే పాన్పయి యున్నది. శరీరము మాత్రమే తోడు. చింకి బొంతయే బట్ట. ఇట్టి తక్కువ దశయందున్నను విషయ వాంఛలు పోకయున్నవి. ఔరా! ఏమిదింత?

శ్లో. స్తనౌ మాంసగ్రంథీ కనకకలశా విత్యుపమితౌ
ముఖం శ్లేష్మాగారం తదపిచ శశాంకేన తులితమ్
స్రవ న్మూత్రక్లిన్నం కరివరశిర స్స్పర్ధి జఘన
మహో నిద్యం రూపం కవిజన విశేషైర్గురుకృతం. 16

చ. స్తనములు మాంసపిండములు ♦ చక్కని బంగరు కుండ లంచు నా
ననము కపాలయంబు తుహి ♦ నద్యుతితుల్యమటంచు మూత్రభా
జనజఘనస్థలంబు కరి ♦ చారుశిరస్సమ మంచుఁ గామినీ
జనమలినాంగముల్ సుకవి ♦ చాతురి వర్ణనకెక్కె నిమ్మహిన్.

తా. స్తనద్వయము మాంసపుముద్దలయినను హేమ కుంభములనియు, ముఖము తెమడ జొల్లులతో కూడినదైనను చంద్రబింబ మనియు, మొల చెమటచేతడసి యసహ్యమైనదైనను నేనుఁగు కుంభములు కెనయగుచున్నదనియు నిట్లు యసహ్యభాజనములగు వానిని కండ్లుగ్రాగా కొందరు కవులు కాముకుల రంజించుటకై వర్ణింతురు.

శ్లో. ఏకో రాగిషు రాజతే ప్రియతమా దేహార్ధ హారీహరో
నీరాగేషు జనో విముక్త లలనా సంగో న యస్మాత్పరః
దుర్వార స్మరబాణపన్నగ విషవ్యావిద్ధముగ్ధో జనః
శేషః కామ విడంబికాన్న విషయాన్ భోక్తుంనమోక్తుం క్షమః 17

చ. కాముకులందు మే సగముఁ ♦ గాంతకు నిచ్చిన శంకరుండె ని
ష్కాములలోనఁ బంచశర ♦ శాసను కన్నఁబరుండుఁ గల్గఁడు
ద్దామ మనోజ బాణవిష ♦ దగ్ధులు తక్కిన మూఢు లోప శే
సీమల భామినీ సుఖముఁ ♦ జేరి భుజింపఁ బరిత్యజింపఁగన్. 17

తా. ఈశ్వరుఁడు ప్రియురాలినే తనసగదేహము చేసి కొనుటవలన నతనికంటె కాముకులలో గొప్పవాడులేడు. నిష్కాములలో శివుడేపెద్ద. తక్కిన కామాంధు లెవ్వరు స్త్రీ సౌఖ్యము నొందుటకు, విడచుటకు సమర్థులు కారుగదా?

శ్లో. అజానందాహాత్మ్యం పతతు శలభా దీపదహనే
సమీనోప్యజ్ఞానా ద్బడిశయుత మశ్నాతు పిశితం
విజానంతో ప్యేతే వయ మిహ విపజ్జాల జటిలా
న్న ముంచామః కామా నహహా గహనో మోహామహిమా. 18

చ. తెలియక నాశహేతువగు ♦ తీవ్రతరానలకీలలోపలన్
శలభము చొచ్చుగాఁక మతి ♦ చాలక మీనము గాలపుం గొనం

గలపిశితంబు తామెసఁగు ♦ గాక యెఱింగియు మేముదుఃఖదో
హాల వనితా సుఖంబు విడ♦నాడము మోహ మహత్వమెట్టిదో. 18

తా. అవివేకముచే శలభము దీపపు శగయందుబడి మృతినొందుచున్నది. జ్ఞాన హీనమై గాలమునందు చిక్కుకొని మత్స్యము చెడుచున్నది. అవి తెలియక చేయుటచే నిరపరాధులు. మేమెఱింగియు దుఃఖప్రదమగు స్త్రీ సౌఖ్యము విడువఁజాలకున్నాము. అందువలన మేము సాపరాధులము. ఆహా! మోహమహిమ తెలియ లేము గదా?

శ్లో. తృషా శుష్య త్యాస్యే పిబతి సలిలం శీతమధురం
క్షుధార్త శ్శాల్యన్నం కబళయతి మాంసాదికలితం
ప్రదీప్తే కామాగ్నౌ సుదృఢతర మాలింగతి వధూం
ప్రతీకారం వ్యాధేః సుఖ మితి విపర్యస్యతి జనః. 19

ఉ. శీతలవారిఁ ద్రావు వడఁ ♦ జెందిననాఁడు క్షుధార్తుఁ డిష్టమృ
ష్టాతతభక్ష్యమాంసకలి ♦ తాన్నము సాపడు మన్మథాగ్నితా
పాతురుఁ డైనవాఁడు జవ ♦ రాలి గవుంగిటిలోనఁ జేర్చు నీ
రీతిని రోగశాంతికర ♦ కృత్యము భోగమనంగఁ జెల్లునే. 19

తా. వడగొట్టినవాఁడు చల్లనీటిచే దాహము దప్పిదీర్చుకొనుచు ఆకలిగొనినవాఁడు రుచికరములగు వంటకములతోడి భోజనమొనర్చును. మన్మథాగ్ని కాహుతియైనవాఁడు జవరాలిని కవుఁగలించుకొనును. ఈవిధముగ రోగశాంతి యగు కార్యములను సౌఖ్యమన జెల్లునే!

శ్లో. తుంగం వేశ్మ సుతా స్సతా మభిమతా స్సంఖ్యాతిగా స్సంపదః
కల్యాణీ దయితా వయ శ్చ నవ మిత్యజ్ఞానమూఢో జనః
మత్వా విశ్వ మనశ్వరం నివిశతే సంసార కారాగృహే
సందృశ్య క్షణభంగురం త దఖిలం ధన్యస్తు సన్న్యస్యతి. 20

చ. పొడవులు మాడువుల్ ఘనులు♦పుత్రులు పెక్కులురమ్యసంపదల్
పడఁతుక చారుశీల యెల ♦ ప్రాయమటంచు నరుండుమూఢుఁడై

కడు జగమెల్ల శాశ్వతము • గాఁ గొని సంసృతి బందిలోవలం
బడునిది మాయచుంచు మతి•మంతుఁడు దావిడుచున్ సమస్తమున్.

తా. ఎత్తగు రమ్యహర్మ్యంబులు, నుగుణులగు పుత్రులు మహదైశ్వర్యము గుణవతియగు పెండ్లము ఎలజవ్వనము మఱియు పద్రపంచము నిత్యమని నజ్ఞానియగు మనుఁడు వమ్మి సంసారసాగరమున దుముకుచున్నాడు. పుణ్యాత్ము డవియెల్ల నస్థిర మని గ్రహించి సన్యాసియగు చున్నాడు

# 3. యాచ్ఞాదైన్యదూషణము.

శ్లో. దీనాదీనముఖై స్సదైవ శిశుకై రాకృష్ణ జీర్ణాంబ రా
క్రోశద్భిః క్షుధితై ర్నిరన్నవిధురా దృశ్యా న చే ద్గేహినీ
యాచ్ఞాభంగ భయేన గద్గదగళత్రుట్యద్విలీనాక్షరం
కో దేహీతివదేత్స్వదగ్ధజఠరస్యార్థేమనస్వీపుమాన్. 21

ఉ. ఆఁకొని యేడ్చు లేజిఱుత • లన్నముకై తనకొంగులాగ బె
ల్లాకట సోలుచుండెదుని • జాంగన దుర్దశఁజూడఁడేనియా
చ్ఞా కలనావిభంగ భయ • సంభృత గద్గదశూన్యకంఠుఁడై
చేకొని దేహియంచడుగ • జేరునె కాలినపొట్ట కెవ్వఁడున్. 21

తా. ఆకలి బాధకోర్వక నేడ్చుచిన్నపిల్లలు తనచిరిగినపైట కొంగులాగుచుండగా నీచావస్థనొందెడి భార్య చూడఁ పోయిన పాడుపొట్టకై యాచించినచో యేదు శమియు దూలవాడుదురోయను భీతిచే "దేహీ" యని యడుగఁజాలడు.

శ్లో. అభిమతమహామానగ్రంథిప్రభేదపటీయసీ
గురుతరగుణగ్రామాంభోజస్ఫుటోజ్జ్వలచంద్రికా
విపులవిలసల్లజ్జావల్లీవితానకుఠారికా
జఠరపిఠరీ దుష్పూరేయం కరోతి విడంబనం. 22

శా. మానగ్రంథివిభేదనక్షమము శుం ♦ భద్ధైర్యగాంభీర్యము
ఖ్యానేకప్రియసద్గుణాంబుజసమూ ♦ హజ్యోత్స్న లజ్జాలతా
హానిస్ఫారకుఠారధార జఠరం ♦ బన్నట్టి పెన్బాన యా
రా నిండారదు దైన్యవృత్త్యభినయ ♦ ప్రాగల్భ్యముం జూపుచున్.

తా. కడుపునియెడికుండ [illegible]వరాపట్టి మానమునుగూడఁ బోగొట్టుచున్నది. గొప్ప గుణములనెల్ల వెన్నెల యందలి దామరలవలె సంకోచింపఁ చేయుచున్నది. గొడ్డలి తీగను త్రుంచునట్లు లజ్జను బోగొట్టుచున్నది. ఎంతనిండించినను నిండదుగాదా! మఱియు యాచనఁగూడ చేయించును.

శ్లో. పుణ్యే గ్రామే వనేవా మహతి సితపటచ్ఛన్నపాలీం కపాలీ
మాదాయ న్యాయగర్భద్విజహుతహుతభుగ్ధూమధూమ్రోపకంఠే
ద్వారం ద్వారం ప్రవిష్టో వర ముదరదరీ పూరణాయ క్షుధార్తో
మానీ ప్రాణైః స్సనాథో న పునరనుదినంతుల్యకుల్యేషుదీనః. 23

చ. అవనిసురావళీహుతహు ♦ తాశనకోమలధూమధూమలా
ప్రవిశదవాటియందు వన ♦ భాగమునందుఁ గపాలపాణి యై
భవనములందు భిక్షగొని ♦ ప్రాణముదాల్చుట కొంతమేలు బాం
ధవులను జేరి వేఁడి కడు ♦ దైనముఁ జెందుటకంటె మానికిన్. 23

తా. స్వరసహితముగ ద్విజులు మంత్రోచ్చారణ జేయుచు వేల్చునగ్నిహోత్రములనుండి వచ్చుపొంగలచే నావరింపబడిన పుణ్యగ్రామమందుగాని, కాననమందుగాని క్షుద్బాధ తీర్చుకొనుటకై యిల్లిల్లుదిరిగి బిచ్చమెత్తుకొనుట గొంతమేలనవచ్చును. అంతియేగాని తనసాటి బంధువుల నడుమ యాచించు దీనవృత్తినుండుట శ్రేయము కాదు.

శ్లో. గంగా తరంగ శీకర శీతలాని
విద్యాధరా ధ్యుషిత చారుశిలాతలాని
స్థానాని కిం హిమవతః ప్రళయం గతాని
య త్సావమానపరపిండరతామనుష్యాః. 24

తే. గీ. పూతగంగోర్మిశీకర ♦ శీతలములు
లలితవిద్యాధరాఢ్యశి ♦ లాతలముల
హిమగిరిస్థానములు నశి ♦ యించె నొక్కొ-
వరులు నిందితపరపిండ ♦ నిరతు లగుట. 24

తా. ఇతరు లవమానపూర్వకముగా బెట్టు భోజనమును దినుటకంటె, గంగాతరంగములవలన చల్లనివాయువులతో కూడి విద్యాధరాదులు విహరించెడి మనోహర శిలాప్రదేశములతో కూడిన హిమవత్ప్రాంతములందు సుఖముగావసించి కాలముబుచ్చుట మనుష్యులకు మిక్కిలి శ్రేయస్కరము.

శ్లో. కిం కందాః కందరేభ్యః ప్రళయ ముపగతా నిర్ఝరా వా గిరిభ్యః
ప్రధ్వస్తా వా తరుభ్య స్సరసఫలభృతో వల్కలీనశ్చ శాఖాః
శీక్ష్యంతే యన్ముఖాని ప్రసభ మపగత ప్రశ్రయాణాం ఖలానాం
దుఃఖోపాత్తాల్పవి త్తస్మయపవనవశాన ర్తితభ్రూలతాని. 25

మ. ఇలఁ గందంబులు మూలముల్ మడిసెనో ♦ యేల్లింకెనో కొండలన్
ఫలముల్ నారలు వృక్షశాఖలయడం ♦ బాడయ్యెనో చూడఁ గే
వలదుఃఖాప్త మితార్థగర్వపవన ♦ వ్యానర్తితభ్రూలస
త్ఖలభూపాస్యము లర్థిఁ జూచెదరు భ్రాం తస్వాంతులై యాచకుల్.

తా. ధనగర్వంబున మరియాదతప్పి బొమలెగాదిగద్రిప్పు దుష్టాత్ముల యాచించుటకు, కందమూలఫలములు నాశనమైనవా? కొండలయందలి యొరులన్నియు నెండినవా? రుచిగాదినుటకు జెట్లయందలి తియ్యనిపండ్లు కట్టుటకు నారలు పాడయినవా? ఇవేవియు గలుగనప్పుడు వారిని యాచించు టెందులకు?

శ్లో. పుణ్యై ర్మూలఫలై స్తథా ప్రియే ప్రణయినీ వృత్తిం కురుష్వాధునా
భూశయ్యా నవవల్కలై రకరుణై రుత్తిష్ఠ యామో వనమ్
క్షుద్రాణా మవివేకమూఢమనసాం యత్రేశ్వరాణాం సదా
విత్తవ్యాధివికారవిహ్వలగిరాం నామాపి న శ్రూయతే. 26

చ. ప్రవిమలకందమూలఫల ♦ పంక్తుల జీలికఁ జేయు ముర్విపై
నవనవపల్లవంబుల నొ ♦ నర్పుము పానుపు లెమ్మ పావనా
టవికిని బోవుమయ్యెడ దృ ♦ ఢదప్రవిణామయదుర్వికారగో
రవవికలోకులై మెలఁగు ♦ రాజుల పేరును జెప్పఁడెవ్వడున్. 26

తా. నీకు నీచుల గొలిచి బ్రతుకరాదను కోరికయున్నచో కందమూలఫలాదులదిని భూమియెపాన్పు జేసికొని క్రొత్తక్రొత్తచిగుళ్లే పరిక్కయమర్చుకొని నారబట్టలు దాల్చి యరణ్యమున సంచరింపుము. అనీవియందు ధనమదముచే తాలుమాలుగా మాట్లాడు నీచప్రభువులతో సంబంధముండదు. అందుచే కాననమందు నీస్వేచ్ఛకే మియు అంగముకాదు.

శ్లో. ఫలం స్వేచ్ఛాలభ్యం ప్రతివనమఖేదం క్షితిరుహాం
పయస్స్థానే స్థానేశిశిరమధురం పుణ్యసరితాం
మృదుస్పర్శా శయ్యా సులలితలతాపల్లవమయీ
సహంతేసంతాపం తదపి ధనినాం ద్వారి కృపణాః 27

చ. కలవు పచేళిమంబు లయి ♦ కానలలోపలఁ బండ్లు భ్రమాకులం
గలవు పవిత్రవాహినులఁ ♦ గమ్మనిశీతలవారిపూరముల్
గలవు చివుళ్ళపాన్పులవి ♦ గై కొననేరకదీనులై ధనా
ఢ్యులగవనిన్ వసించినరు ♦ లోలిసహింతురుతీవ్రతాపముల్. 27

తా. వనంబులందలి తరుశాఖలన్నియు దివ్యనిపండ్లతోఁగూడియున్నవి. గంగావర్ణదాధి పవిత్రనదులందు సదా దివ్యానీరు ప్రవహించుచున్నది. మృదువగు పల్లవశయ్యాతలంబులున్నయవి. పైవానితో దృప్తిఁజెందక దరిద్రులై గొప్పవారలవంచను నిలువబడి పెక్కుబాధల నొందదరేల?

శ్లో. యే వర్ధంతే ధనపతిపురః ప్రార్థనా దుఃఖభాజో
యే చాల్పత్వం దధతివిషయాక్షేపపర్యస్తబుద్ధేః
తేషా మంతస్స్ఫురితహసితం వాసరాణాం స్మరేయం
ధ్యానచ్ఛేదే శిఖరికుహరిగ్రావశయ్యానిషణ్ణః. 28

చ. ధనపతిమ్రోల నిల్చి కడు ♦ దైన్యముఁజూపెడు వారలెవ్వరో
ఘనవిషయాభిలాష మతి ♦ కల్పనమీరిన నీచులెవ్వరో
మొనయుచు ఘోరిదుష్టదిన ♦ ముల్ మదినవ్వి తలంతు నాత్మచిం
తనము తుదిన్ గుహాంతరము ♦ నన్ రుచిరోపల తల్పశాయినై. 28

తా. ఐశ్వర్యవంతులఁజేరి కడుదరిద్రులుగా నెవరు నటింతురో, ఎవరింద్రియార్థముల యొక్క కోరికలవలన మానసమునందుపాపముగల నైచ్యముతో నుందురో, వారి దుర్దినములఁగూర్చి, విరక్తిఁబొంది గిరిగుహాలందుండెడి శిలశయ్యయందుండి సమాధియనంతరము "ఎట్లానినముల గడపితిమో?" యని ఆశ్చర్యచకితుఁడనై లోలోనన నవ్వుకొందును.

శ్లో. యేసంతోష నిరంతరప్రముదితాస్తేషాం న భిన్నోముదో
యే త్వన్యే ధనలుబ్ధసంకులధియ స్తేషాం న తృష్ణాహతా
ఇత్థం కస్య కృతే కృత స్సవిధినా తాదృక్పదంసమ్పదాం
స్వాత్మన్యేవ సమాప్త హేమమహిమా మేరు ర్నమే రోచతే.

మ. వరసంతోషనిరంతరప్రముదితుల్ ♦ వర్ణింప నెవ్వారు ని
ర్భరముల్ వారికి మోదముల్ కనకలు ♦ బ్ధస్వాంతు లౌవారికిన్
విరతిం బొందదు తృష్ణ యెవ్వరికిఁ గా ♦ వింపంబడెన్ బ్రహ్మచే
స్థిర సంపన్నిధి మేరు వాత్మధృతల ♦ క్ష్మీకంబు నాకిష్టమే. 29

తా. దైవికముగా దొరకినవాటితో తృప్తిఁజెందు పురుషులకు నానందమేమియుఁ జెడక పెరుగుచునే యుండును దరిద్యమునకై పేరాసఁ జెందియుండు వానికి తృష్ణ పోవకయే యుండును నిత్యానంగునకు మేరువువచ్చి పడినను నపేక్షగలుగదు. పేరాసగలవానికి మేరువైనను జాలదు. అట్టి మేరువెవ్వని కుపయోగపడకుండుటచే నాకును సమ్మతముగాదు.

శ్లో. భిక్షాహార మదైన్య మప్రతిముఖం భీతిచ్ఛిదం సర్వదా
దుర్మాత్సర్యమదాభిమానమథనం దుఃఖౌఘవిధ్వంసనం

చ. ప్రవిమలకందమూలఫల ♦ పంక్తుల జీవికఁ జేయు మర్త్యపై
నవనవపల్లవంబుల నొ ♦ నర్పుము పానుపు లెమ్మ పావనా
టవికిని బోవుమయ్యెడ దృ ♦ ఢదరిద్రవినాశమయదుర్వికారగో
రవవికలోకులై మెలఁగు ♦ రాజుల పేరును జెప్పఁజెవ్వడున్. 26

తా. నీకు నీచుల గొలిచి బ్రతుక రాదను కోరికయున్నచో కందమూలఫలాదులదిని భూమియె పాన్పు జేసికొని క్రొత్తక్రొత్త చిగుళ్లే పక్కయమర్చుకొని నారబట్టలు దాల్చి యరణ్యమున సంచరింపుము. అనీవియందు ధనమదముచే తాలుమాలుగా మాట్లాడు నీచప్రభువులతో సంబంధముండదు. అందుచే కాననమందు నీకన్యత్ర మియు అంగము కాదు.

శ్లో. ఫలం స్వేచ్ఛాలభ్యం ప్రతివనమఖేదం క్షితిరుహాం
పయస్స్థానే స్థానే శిశిరమధురం పుణ్యసరితాం
మృదుస్పర్శా శయ్యా సులలితలతాపల్లవమయీ
సహంతేసంతాపం తదపి ధనినాం ద్వారి కృపణాః 27

చ. కలవు పచేళిమంబు లయి ♦ కానలలోపలఁ బండ్లు భ్రమాకులం
గలవు పవిత్రవాహినులఁ ♦ గమ్మనిశీతలవారిపూరముల్
గలవు చివుళ్ళపాన్పులవి ♦ గ్రైకొననేరకదీనులై ధనా
ఢ్యులగవనిన్ వసించినరు ♦ లోలిసహింతురుతీవ్రతాపముల్. 27

తా. వనంబులందలి తరుశాఖలన్నియు దివ్యనిపండ్లతోఁగూడియున్నవి. గంగావర్ణాది పవిత్రనదులందు సదా దివ్యనీరు ప్రవహించుచున్నది. మృదువగు పల్లవ శయ్యాతలంబులున్నయవి. వైవానితో దృష్టిఁజెందక దరిద్రులై గొప్పవారలవంచను నిలువబడి పెక్కుబాధల నొందదరేల?

శ్లో. యే వర్ధంతే ధనపతిపురః ప్రార్థనా దుఃఖభాజో
యే చాల్పత్వం దధతివిషయాక్షేపపర్యస్తబుద్ధేః
తేషా మంతస్స్ఫురితహసితం వాసరాణాం స్మరేయం
ధ్యానచ్ఛేదే శిఖరికుహరిగ్రావశయ్యానిషణ్ణః. 28

చ. ధనపతిమోళ్ల నిల్చి కడు ♦ దైన్యముఁజూపెడు వారలెవ్వరో
ఘనవిషయాభిలాష మతి ♦ కల్పనమీరిన నీచులెవ్వరో
మొనయుచు ఘోరిదుష్టదిన ♦ ముల్ మదినవ్వి తలంతు నాత్మచిం
తనము తుదిన్ గుహాంతరము ♦ నన్ రుచిరోపల తల్పశాయినై. 28

తా. ఐశ్వర్యవంతులఁజేరి కడుదరిద్రులుగా నెవరు నటింతురో, ఎవరింద్రియార్థముల యొక్క కోరికలవలన మానసమునందుపాయముగల నైచ్యములో నుందురో, వారి దుర్దినములఁగూర్చి, విరక్తినొంది గిరిగుహలందు డెక్కి శిలశయ్యాయందుండి సమాధియనంతరము "ఎట్లానినముల గడపితిమో?" యని ఆశ్చర్యచకితుఁడనై లోలోనన నవ్వుకొందును.

శ్లో. యేసంతోష నిరంతరప్రముదితాస్తేషాం న భిన్నోముదో
యే త్వన్యే ధనలుబ్ధసంకులధియ స్తేషాం న తృష్ణాహతా
ఇత్థం కస్య కృతే కృత స్సవిధినా తాదృక్పదంసమ్పదాం
స్వాత్మన్యేవ సమాప్త హేమమహిమా మేరు ర్నమే రోచతే.

మ. వరసంతోషనిరంతరప్రముదితుల్ ♦ వర్ణింప నెవ్వారు ని
ర్భరముల్ వారికి మోదముల్ కనకలు ♦ బ్ధస్వాంతు లౌవారికిన్
విరతిం బొందదు తృష్ణ యెవ్వరికిఁ గా ♦ వింపంబడెఁ బ్రహ్మచే
స్థిర సంపన్నిధి మేరు వాత్మధృతల ♦ శ్లోకంబు నాకిష్టమే. 29

తా. దైవికముగా దొరకినవాటితో తృప్తిఁజెందు పురుషులకు నానందమేమియు జెడక పెరుగుచునే యుండును దరిద్యమునకై పేరాసఁ జెందియుండు వానికి తృష్ణ పోవకయే యుండును నిత్యానంగునకు మేరువువచ్చి పడినను నపేక్షగలుగదు. పేరాస గలవానికి మేరువైనను జాలదు. అట్టి మేరువెవ్వని కుపయోగపడకుండుటచే నాకును సమ్మతము గాదు.

శ్లో. భిక్షాహార మదైన్య మప్రతిముఖం భీతిచ్ఛిదం సర్వదా
దుర్మాత్సర్యమదాభిమానమథనం దుఃఖౌఘవిధ్వంసనం

సర్వత్రాన్వహ మప్రయత్నసులభం సాధుప్రియం పావనం
శంభో స్సత్రమ వార్యమక్షయనిధిం శంసంతియోగీశ్వరాః. 30

మ. అభివర్ణింతురు యోగిపుంగవులు భి ♦ క్షాహారమున్ భూతదై
న్య భయక్రోధ మదాభిమాన జడిమా ♦ హంకారమున్ సత్సుఖ
ప్రభవం బశ్రమ లభ్యమూర్జిత మవా ♦ ర్యం బక్షయం బుగ్రదుః
ఖభిదాదక్షము శంభుసత్రము మహా♦కైవల్య సత్పాత్రమున్. 30

తా. భిక్షయే యాహారమయినచో దీనత్వము కలుగనిది అడ్డము లేనిది, సదా భయము పోగొట్టునది, అజ్ఞానగర్వముల బాధించునది, కష్టముల నివారించుచు ప్రతి దినము నిష్ప్రయత్నముగ దొరకునదియగు శివపూజ వారింపరాని నిక్షేపముగా యోగి పుంగవులు వర్ణించెదరు.

---

# 4 భోగాస్థైర్యవర్ణనము.

శ్లో. భోగే రోగభయం కులే చ్యుతిభయం విత్తే నృపాలాద్భయం
మానే దైన్యభయం బలే రిపుభయం రూపే జరాయాభయం
శాస్త్రే వాదభయం గుణే ఖలభయం కాయే కృతాన్తాద్భయం
సర్వం వస్తుభయాన్వితం భువినృణాం వైరాగ్య మేవా భయం.31

చ. బలగుణభోగ రూపకుల ♦ ధర్మ కళేబర శాస్త్ర మానముల్
బలిఖల రుగ్జరాచ్యుతి నృ ♦ పాలయ మప్రతివాది దైన్య సం
కుల భయయుక్తముల్ నరుల ♦ కుఁ భువినెవ్వియునిర్భయంబులే
వెలకొని యెన్నిభంగులను♦నిర్భయ మొక్క విరాగమే సుమీ. 31

తా. మనుజులశక్తి వైరులచేతను, సుగుణంబులు దుష్టులచేతను భోగములు రోగములచేతను, అందము ముసలితనముచేతను, కులము చెడిపోవుటవలనను, ధనము రాజులవలనను, జమునిచే దేహము, పాండిత్యము ప్రతివాదముచేతను, మనస్సుదీనత్వమువలనను నాశనమగును. నాశనముకానిది యొక్క విరక్తియే.

శ్లో. ఆక్రాంతం మరణేన జన్మ జరయా విద్యుచ్చలం యౌవనం
సంతోషో ధనలిప్సయా శమసుఖం ప్రౌఢాంగనా విభ్రమైః
లోకై ర్మత్సరిభి ర్గుణా వనభువో వ్యాళై ర్నృపాదుర్జనై
రస్థైర్యేణ విభూతయోప్యుపహతా గ్రస్తం న కిం కేన వా. 32

చ. జననము చావుచేత శమ ♦ సౌఖ్యము కాంతలలీలచేత జ
వ్వనము జరార్తిచేత గుణ ♦ వర్గము కూళలచేత రాజు దు
ర్జనములచే ముదంబు ధన ♦ రాగముచే సిరులెల్ల లేమిచే
వినిహతిఁ జెందె దోషపరి ♦ విద్ధముగాదె తలంప నెద్దియున్. 32

తా. పుట్టుకను చావుస్వరూపముతో నాశనము జేయుచున్నది. శాంతి సౌఖ్యము స్త్రీలీలచే గలతనొందుచున్నది. యౌవనము ముదిమి పాడుచేయుచున్నది. సుగుణములన్నియు దుర్జనులచే పాడుచేయ బడుచున్నవి. రాజు దుర్మంత్రములఁ జెప్పు వారల వలన పాడగుచున్నాడు. దరిద్ర్యాశ సంతోషమును చెఱుపుచున్నది. నిలుకడ లేని సంపదలు. ఇట్లు ప్రతివిషయము దోషసహితమైనదే గదా!

శ్లో. ఆధివ్యాధిశతై ర్జనస్య వివిధై రారోగ్య మున్మూల్యతే
లక్ష్మీ ర్యత్ర పతంతి తత్ర వివృతద్వారా ఇవ వ్యాపదః
జాతం జాత మవశ్య మాశు వివశం మృత్యుః కరో త్యాత్మసా
త్తత్కిం నామ నిరంకు శేన విధినా య న్నిర్మితం సుస్థిరం. 33

శా. ఆధివ్యాధిశతంబుచే జనులధై ♦ ర్యంబెల్ల నిశ్శోభమై
బాధింపంబడు సంపద ల్గలుగునో ♦ ప్రత్యక్షమై ద్వారసం
రోధం బేమియులేకదుర్దశలు చే ♦ రున్ మృత్యువున్ మర్త్యులన్
వేధించున్ విధియేదిసుస్థిరముగా ♦ నిర్మించె తర్కించినన్. 33

తా. మనుష్యుల ధైర్యము అనేక విధములయిన మనోవ్యాధులచేతను వ్యాధులచేతను నశించుచున్నది. సంపదలున్న నిరాటంకముగా ఆపదలు కలుగును. పుట్టిన ప్రాణికెల్ల చావు విధింపబడియే యున్నది. బ్రహ్మ నిర్మించిన దేదియూ స్థిరముకాదు. నిర్బాధాకరమైనది సృష్టింపబడి యుండలేదు.

శ్లో. భోగా స్తుంగతరంగభంగతరళాః ప్రాణాః క్షణధ్వంసినః
స్తోకాన్యేవ దినాని యౌవనసుఖస్ఫూర్తిః ప్రియాసుస్థితా
త త్సంసార మసార మేవ నిఖిలం బుద్ధ్వా బుధా బోధకా
లోకానుగ్రహపేశలేన మనసా యత్నః సమాధీయతాం. 34

ఉ. తుంగ తరంగ భంగముల తో ♦ దులఁదూగు విలోల భోగముల్
భంగపడున్ నిమేషమునఁ ♦ బ్రాణము కొన్నిదినంబులే సుఖం
బంగనలందు నిల్చు మది ♦ నారసి బ్రహ్మవిచారయత్నము
ప్పొంగుచుఁ జేయఁగావలయు ♦ భూరి జగద్ధిత బుద్ధి బండితుల్. 34

తా. భోగములు చంచలములై స్థిరమైనవిగావు. నిమిష మాత్రమైనదే గాని ప్రాణము నిలుకడలేనిది. వనితా సుఖము కొలదిదినములే గాని యావజ్జీవమంతయుఁ నుండదు. కావున పండితులైనవారు సంసార మనిత్యమని యెఱింగి విరక్తిఁబొంది యుండవలయును.

శ్లో. భోగా మేఘవితానమధ్యవిలసత్సౌదామినీచంచలా
ఆయు ర్వాయువిఘట్టితాబ్జపటలీలీనాంబువద్భంగురమ్
లోలా యౌవనలాలనా తనుభృతా మిత్యాకలయ్య ద్రుతం
యోగీ ధైర్యసమాధిసిద్ధసులభే బుద్ధిం విధద్ధ్వం బుధాః. 35

చ. జలదములోనిక్రొమ్మెఱుఁగు ♦ జాయలు భోగపరంపరల్ మహా
నిలపరిఘట్టితాబ్జదళ ♦ నీరతుషారము జీవితంబు చం
చలతరముల్ వయోభిమత ♦ సౌఖ్యము లీగతి నాలకించి స
భ్యులు పరమాత్మయోగమున ♦ బుద్ధి ఘటించుఁడు సత్వరంబుసన్. 35

తా. మేఘమాలలోని తళుక్కని మెఱసి మాయమగు మెఱుగు రేఖలో సమానములు భోగములు. తామరయాకు నందలి నీటిబిందువుతో సాటియైనది జీవితము. యౌవన సౌఖ్య మతిచంచల మయినది. కావున బుద్ధిమంతులు సత్వరముగా పరబ్రహ్మ పదార్థము దర్శింపఁగోరవలెను.

శ్లో. ఆయుః కల్లోలలోలం కతిపయదివసస్థాయినీ యౌవనశ్రీ
రర్థా స్సంకల్పకల్పా ఘనసమయతటిద్విభ్రమా భోగపూగాః
కంఠాశ్లేషోపగూఢం తపసి చ నచిరం యత్ప్రియాభిః ప్రణీతం
బ్రహ్మణ్యాసక్తచిత్తా భవత భవభయాంభోధి పారం తరీతుమ్.

ఉ. ఆయువు వీచిచంచలము ♦ యౌవన మల్పదినోచితంబు పు
ష్పాయుధ కేళిజన్యసుఖ ♦ మస్థిర మర్థము వాంఛవోలె సా
పాయము భోగముల్ మెఱపు ♦ లట్లుభ్రమించు భవాబ్ధి లంఘనో
పాయము బ్రహ్మచింతనము ♦ బాయక చేయుడు సజ్జనోత్తముల్. 36

తా. తరంగములవలె చంచలమైనది ఆయువు. జవ్వనము అల్పగిన పరిమాణము. విషయసౌఖ్యము లస్థిరములు. ద్రవ్యము వాంఛవలె సాపాయముగలది. సంసారసాగరము దాటుటకు బ్రహ్మచింతనమే నావయైయున్నది. కావున సదా బ్రహ్మధ్యానైకపరులుకండు.

శ్లో. కృచ్ఛ్రేణామేధ్యమధ్యే నియమితతనుభిః స్థీయతే గర్భవాసే
కాంతావిశ్లేషదుఃఖవ్యతికరవిషమో యౌవనే చోపభోగః
వామాక్షీణా మవజ్ఞావిహసితవసతి ర్వృద్ధభావోఽప్యసాధుః
సంసారే రేమనుష్యా వదత యది సుఖం స్వల్ప మప్యస్తికించిత్. 47

ఉ. కాయము గుంచిగర్భనర ♦ కంబున నుండుట దుఃఖమాదియం
దాయతలోచనావిరహ ♦ మబ్బుట దుఃఖము జవ్వనంబునం
బాయక భామినీ సహన ♦ పాత్రము దుఃఖము వృద్ధభావమిం
కేయడ గల్గు సౌఖ్యలవ ♦ మించుకయే జనులార చెప్పుడీ. 37

తా. ప్రథమ విచారకారణము సర్వావయవములు ముడుచుకొని గర్భనరకమందుండుట పిదప యౌవనమున స్త్రీవియోగము కలిగిన దుఃఖము. మూడవది ముసలితనము సౌఖ్యముగ గడపుచున్న స్త్రీల పరిహాసముల పాలగుట. ఇట్టిసంసారమున నీసమయిన సౌఖ్యమున్నదని బుద్ధిమంతులు చెప్పుదురా?

శ్లో. వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయంతీ
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరంతి దేహమ్

ఆయుః పరిస్రవతి భిన్నఘటా దివాంభో
లోక స్తథా ప్యహిత మాచర తీతిచిత్రం. 38

చ. కడు వెఱపించుచున్ ముదిమి ♦ గద్దఱిబెబ్బులిమాడ్కి నున్నదె
క్కుడుపగదాయులంబలెఁ దె ♦ గుళ్ళు శరీరము నొంచుచున్న వె
ప్పుడు జనుభిన్నకుంభజల ♦ ముంబలె నాయువు లిట్టు లయ్యుదా
రుడుగక మానవుల్ దురిత ♦ మోలి నొనర్చుచు నున్నవారహో. 38

తా. శార్దూలముభంగి వృద్ధత్వము సదాభయముకలిగించుచున్నది. శతృవుల వలె రోగములు దేహమును పీడించుచున్నవి. భిన్నభాండమునుండి జలమువలె నాయువు క్షణములో బోవుచున్నది. ఇట్లయ్యును జనులు పాపకృత్యములే జేయుచున్నారు.

శ్లో. భోగా భంగుర వృత్తయో బహువిధా స్తై రేవ చాయం భవ
స్తత్క స్యేహ కృతే పరిభ్రమత రేలోకాః కృతం చేష్టితైః
ఆశాపాశశతోపశాంతి విశదం చేతస్సమాధాయ తే
కామోచ్ఛిత్తివశే స్వధామని యది శ్రద్ధేయ మస్మద్వచః. 39

చ. తరళతరంబులున్ బహువి ♦ ధంబులు భోగము లీదురంతసం
సరణము వానిచే బొడమె ♦ జాలుఁ బరిభ్రమణంబువానికై
నరులు మదీయభాషణము ♦ నమ్మెదరేని శమప్రసన్నమై
పరగు మనంబు శంభుపద ♦ పద్మయుగ ప్రవణంబు సేయుడీ. 39

తా. బహువిధములుగానున్న భోగములు స్థిరములు కావు. అట్టి యస్థిరములచే జేయబడిన దాసంసారముగుటచే నదియు స్థిరము కాదు. నిస్సారమగు నీసంసారమున దిరుగుటకంటె నే చెప్పుమాట వినుడు. అది యేదన సదా శివధ్యానైక తత్పరులుకండు. అదియే మోక్షసాధనము.

శ్లో. బ్రహ్మేంద్రాది మరుద్గణా స్తృణకణా న్యత్రస్థితో యన్న తే
యత్స్వాదా ద్విరసా భవంతివిభవా స్త్రైలోక్య రాజ్యాదయః
భోగం కోపి స ఏక ఏవపరమో నిత్యోదితో జృంభతే
భో సాధో క్షణభంగురే తదితరే భోగే రతింమాకృథాః. 40

చ. ఎందు వసించి ధన్యుడు వి ◆ ధీంద్రముఖామరకోటి నెల్ల నెం
చుం దృణమట్ల దేనిఁ జవి ◆ చూచుటచే రసహీనభావముం
జెందు జగత్ప్రభుత్వములు ◆ జెప్పగరాని యనంతకేవలా
నందము దానియందు మది ◆ నాటుము మాను మునీచభోగముల్ 40

తా. ఎవఁడు పరబ్రహ్మపదార్థము తెలిసికొనునో యాతఁడు బ్రహ్మేంద్రాది దేవతలఁగూడ దృణీకరించును. బ్రహ్మజ్ఞానముచే సంతాభ్యాసయు సంపన్నమై వెలయుచుండును. కేవల మజ్ఞానాంధకారమగు సంసారము విడచి పరబ్రహ్మపదార్థముఁ దెలిసికొన బ్రయత్నింపుము.

---

## 6 కాలమహిమానువర్ణనము.

శ్లో. సా రమ్యా నగరీ మహాన్స నృపతిస్సామన్త చక్రం చ త
త్పార్శ్వే తస్య చ సా విదగ్ధపరిష త్తాశ్చన్ద్రబింబాననాః
ఉద్రిక్త స్సచ రాజపుత్రనివహ స్తేవన్దినస్తాః కథాః
సర్వం యస్య వశా దగాత్ స్మృతిపథం కాలాయతస్మై నమః. 41

మ. అది మేలైనపురంబు పూజ్యచరితుం ◆ డారాజు రాణ్మండలం
బది పార్శ్వంబున నావిదగ్ధసభ వా ◆ రబ్జాక్ష్య లత్యుద్ధతం
బది రాజన్యక మద్ది వందినికరం ◆ బాగాథలున్ సర్వమున్
గదలం జేసిన కాలమూర్తికి నమ ◆ స్కారంబు సత్కీర్తికిన్. 41

తా. అది రమ్యమగు పురరాజము. ఆపురమేలురాజు గొప్పవాడు. అతని చుట్టు సామంతరాజులు గొలుచుచున్నారు. పండితబృంద మా రాజుతో సరసగోష్ఠి సలుపుచున్నారు. అతని స్తుతిపాఠకు లాతనిని స్తుతించుచున్నారు. అతని ముచ్చటలు మొదలయినవియన్నియును నశించి కేవలము స్మరణమాత్రావశిష్టములై యున్నవి. ఇదంతయు గాలమహిమయే. అట్టికాలంబున కేను నమస్కారంబు జేయుచున్నాను.

శ్లో. యత్రానేకే క్వచి దపి గృహే తత్ర తిష్ఠ త్యథైకో
యత్రాప్యేక స్తదను బహవ స్తత్ర నైకోపి చాంతే
ఇత్థం చేమౌ రజనిదివసౌ దోలయంద్వావివాక్షౌ
కాలః కల్యా భువన ఫలకే క్రీడతి ప్రాణి శారైః. 4

శా. ఏయింటన్ వసియించు పెక్కు లొకఁడౌ ♦ యింటం బ్రవర్తించునే
చాయన్ నిల్చు నొకండు పెక్కులచటన్ ♦ సంధిల్లు నొండైన లే
దాయింటన్ మదినిట్లు రాత్రి దిన రూ ♦ పాక్షద్వయింజిమ్ముచుం
జేయుం గాలుఁడు క్రీడలోకఫలక ♦ శ్రేణిన్ నృశారంబులన్. 4

తా. సంసారమందు నొకయింటిలో పెక్కండుండిన నచట నొకడేయుం డును. ఎచట నొకఁడును తర్వాత పెక్కండుగలరో యచట చివరకు నొకడైన నుం డఁడు. ఇదంతయుఁ జూడగా కాలమను జూదరి భూమియనెడి నెత్తపు బల్లయందు దివారాత్రములనెడి రెండుసాచికల నొర్లించుచు కాళికతోడ ప్రాణులనెడి సారెలతో జూదమాడుచున్నట్లు గోచును

శ్లో. ఆదిత్యస్య గతాగతై రహరహస్సం క్షీయతే జీవితం
వ్యాపారై ర్బహుకార్యభార గురుభిః కాలో న విజ్ఞాయతే
దృష్ట్వా జన్మజరావిపత్తి మరణం త్రాసశ్చ నోత్పద్యతే
పీత్వా మోహమయీం ప్రమాద మదిరా మున్మత్త భూతంజగత్

చ. అనుదినమున్ నశించుఁ బర ♦ మాయువు సూర్యుని రాకపోకలన్
ఘనబహు కార్యభారములఁ ♦ గాలము పోవుట గానరాదు సం
జనన జరామయంబులును ♦ జావును జూచి భయంబు లేదు దు
ర్జన భువనంబు మోహమది ♦ రారసవిహ్వలమయ్యె నయ్యయో.

తా. సూర్యోదయాస్తమయములచే నాయువు క్షీణించుచున్నది. జీవితము కొరకు పెద్దకార్యములలో మునిగియుంటచే కాలముపోవుచు నాయువు క్షీణించుట తెలియలేదు. పుట్టుట, ముసలితనము, కష్టములు, గిట్టుట మొదలగువానికి భయము జెం దరు. కేవలము పరాకనలన పిచ్చిగొని యుబెల చేయుదురు.

శ్లో. రాత్రి స్సైవ పునస్సఏవ దివసో మత్వాబుధా జంతవో
ధావంత్యద్యమిన స్తథైవ విభృత ప్రారబ్ధ తత్తత్క్రియాః
వ్యాపారైః పునరుక్త భుక్త విషయై రేవం విధే నాముసా
సంసారేణ కదర్థితా వయమహో మోహాన్న లజ్జామహే. 44

ఉ. వచ్చిన రాత్రులే తిరిగి ♦ వచ్చుట పోయిన వాసరంబులే
వచ్చు నెఱింగి గూఢతర ♦ వర్తనులై పునరుక్త కార్యముల్
నిచ్చలు సేయుచున్ జనులు ♦ నిశ్చయ వృత్తి జరింతు రీభవా
భ్యుచ్చయ రీతిచే జెడి ఋ ♦ బుద్ధులు సిగ్గువహింప రెంతయున్. 44

తా. రాత్రింబవళ్ళు గాని వాసరంబులు గాని వచ్చిపోయినవే మరలవచ్చును గాని యంతకంటె విశేషించి రావు. ఈవిషయము నెఱింగియు పూర్వమొనరించిన కార్యము లనే మరల జేయుటకు బయ గెత్తుచున్నారు. లజ్జాకరమైన సంసారము నిర్వేదకముగదా! సంసారమందలి లజ్జాకరమైన బ్రతుకునకెంతో సిగ్గుపడవలసిన వారమైయును అజ్ఞానాంధకారమున సిగ్గుపడకుండు టెంతయు వింతగాయున్నవి.

శ్లో. నధ్యాతం పరమీశ్వరస్య విధివత్సంసార విచ్ఛిత్తయే
స్వర్గ ద్వారకవాటపాటనపటు ర్ధర్మోపి నోపార్జితః
నారీపీన పయోధరోరు యుగళం స్వప్నేపి నాలింగితం
మాతుః కేవలమేవ యౌవన వనచ్ఛేదే కుఠారావయం. 45

ఉ. శ్రీరమణీయ శంభుపద ♦ చింతయొనర్చుట లేదు గోపుర
ద్వార కవాట పాటన సు ♦ ధర్మము సేయుటలేదు సుందరీ
హారి కుచోపలబ్ధిఁ గల ♦ నైననెఱుంగము మాతృయౌవనో
దార వనీకుఠారముల ♦ మై జనియించిన వారమిమ్మహిన్. 45

తా. సంసారము వదలునట్లు పరమేశ్వర ధ్యానముఁజేసి మోక్షమైన సంపాదించలేదు. స్వర్గము నిరాటంకముగఁ బోనిచ్చు ధర్మమైన గణింపలేదు. స్త్రీలతోడి సౌఖ్యము కలలోనైన బొందకపోవుటచే కామపురుషార్థమునకు దూరులమైతిమి. కనుక

తల్లిదండ్రియను దూషించుటకై పుట్టితిమిగాని వేఱుపరియోజనము కొఱకై పుట్టలేక పోయితిమి.

శ్లో. నాభ్యస్తా భువి వాదిబృందదమనీ విద్యా వినీతోచితా
ఖడ్గాగ్రైః కరికుంభపీఠదళనై ర్నాకం న నీతం యశః
కాంతాకోమలపల్లవాధరరసః పీతో న చంద్రోదయే
తారుణ్యం గతమేవనిష్ఫల మహో శూన్యాలయే దీపవత్. 46

చ. వలనుగ విద్య నేర్చి ప్రతి ♦ వాదుల గెల్చుట లేదు కుంభిని
ర్గళనవిశాతఖడ్గముల ♦ దైవతలోకమునందు గీర్తులున్
నిలుపుట లేదు చారురమ ♦ ణీమధురోష్ఠము గ్రోలలేదుని
ష్ఫలమయి జవ్వనం బరిగె ♦ బాడుగృహం బున దీపముంబలెన్. 46

తా సర్వవిధముల నుపయోగించువిద్య సంపాదించి ప్రతివాదులను గెలువలేదు వీరత్వముబొంది బగవారి యేనుగుల కుంభములజీల్చి కీర్తియునేగు. శృంగారముప్పతిలు చంద్రోదయకాలమున స్త్రీయురాలి చిగురాకుమోవి నానినవారము గాము ఇట్లు విద్యాధనములేక కీర్తిధనములేక సుఖమునందకకటా! మ జవ్వనమంతయు వ్యర్థమైనది.

శ్లో. విద్యా నాధిగతా కళంకరహితా విత్తంచ నోపార్జితం
శుశ్రూషాపి సమాహితేన మనసా పిత్రోర్నసమ్పాదితా
ఆలోలాయతలోచనాః ప్రియతమాః స్వప్నేపినాలింగితాః
కాలోయం పరపిండలోలుపతయా కాకైరివ ప్రేరితః. 47

చ. వినయవిశేషహృద్యలగు ♦ విద్యలు నేర్చుటలేదు నీతిచే
ధనమును గూర్పలేదు తలి ♦ దండ్రుల సేవయుఁ జేయలేదు చ
క్కని చిగురాకు బోండ్ల బిగి ♦ కౌగిలియుం గలనైన లేదు గ్రో
బ్బున సమయంబు కాకులకుఁ ♦ బోలె గమించె బరాన్నభుక్తులన్ 47

తా కళంకరాహిత్యమగు విద్య నభ్యసింపలేదు. భోగత్యాగ సాధనమగు ధనము కూడబెట్టలేదు. తల్లిదండ్రుల కచ్చరికతో బనిచేయలేదు. ప్రియాయంపుచూపుల

వనితల గౌఁగలించవలేదు. కాలమంతయు బరులకుంచనుండి గాశిపలె పొట్టపోసి కొను చుంటిమి. కాని మోక్షపురుషార్థము గడియింపనేరమయితిమి.

శ్లో. వయం యేభ్యో జాతా శ్చిరపరిగతా ఏవ ఖలు తే
సమం యైస్సంవృద్ధా స్స్మృతివిషయం తేపిగమితాః
ఇదానీమేతే స్మః ప్రతిదివస మాసన్నపతనా
గతాస్తుల్యావస్థాం సికతిలనదీరతరుభిః. 48

ఉ. తాలిమిమాలికన్నతలి ♦ దండ్రిల దోడమెలంగు వారలం
గాలము గోలుపుచ్చెనని ♦ కావరు ఘోరజరాభరార్తులై
తూలుచు నిత్యసన్నిహిత ♦ దుర్దశులై సికతాలగన్నదీ
కూలమహామహీజముల ♦ కన్ సరివత్తురు మూఢమానవుల్. 48

తా. మనల గని పెంచినవారు పోయి చాలకాలమయినది. మన మెవరిలోఁ బెరిగితిమో వారు స్మరణకుమాత్రమే యున్నారు. ఇఁక మేము యిసుకపాలైన యేటిగట్టు నానాటికి చావును సమీపించుచు నిండె యున్నారము.

శ్లో. ఆయుర్వర్షశతం నృణాంపరిమితం రాత్రౌతదర్ధంగతం
తస్యార్ధస్యపరస్య చార్ధమపరంబాలత్వ వృద్ధత్వయోః
శేషం వ్యాధి వియోగదుఃఖసహితం సేవాదిభిర్నీయతే
జీవే వారితరంగచంచలతరే సౌఖ్యంకుతః ప్రాణినామ్. 49

ఉ. ఆయువు నూఱువత్సరము ♦ లందు సగంబు నశించె నిద్రచే
నాయుఱలో సగంబు గత ♦ మయ్యెను బాల్యజరాప్రసక్తిచే
బాయక తక్కినట్టి సగఁ ♦ బాలు గతించు బ్రియాసవృత్తిచే
నాయువు చంచలంబగుట ♦ బ్రాణుల కెట్లు సుఖంబుచేకురుఁ. 49

తా. మనుష్యులకు ఆయుర్దాయము నూరువర్షములు. అందు యేబది సంవత్సరములు నిద్రాకాలమగు రాత్రికాలమునఁ దీఱినది. మిగత సగమునందు సగము ఇరువైయైదేండ్లు అజ్ఞానాసక్తులతో గూడిన బాల్య వృద్ధత్వములవలన గడచినది. మిగిలినయిరువదియైదేండ్లును సంసారమందలి కష్టములతో దీఱినది. అతిచంచలమగు నాయువు కలిగిన సుఖమున కవకాశ మెక్కడిది!

శ్లో. క్షణం బాలో భూత్వా క్షణమపి యువా కామరసికః
క్షణం విత్తైర్హీనః క్షణమపిచ సంపూర్ణవిభవః
జరాజీర్ణైరంగై ర్నట ఇవ వలీమండితతను
ర్నర స్సంసారాంతే విశతి యమధానీయవనికాం 50

ఉ. బాలకుఁడై క్షణంబు యువ ♦ భావయుతుండయి కొంతకాలము
ద్వేల దరిద్రుడై క్షణము ♦ విత్తసమన్వితుఁడై క్షణంబుజీ
ర్ణాలస గాత్రుఁడై నటుని ♦ యట్ల నటించి తుదిన్ నరుండు యా
మ్యాలయ నామమైన తెర ♦ యందు జొరంబడు సత్వరంబుగన్. 50

తా. మనుష్యుఁ డొకనటునివలె కొంతకాలము బాలుఁడుగాను, కొంతకాలము కామసుఖము లనుభవించు యౌవనుఁడుగాను, క్షణకాలము గొప్పదరిద్రుడుగాను, మఱి కొంతకాలము ఐశ్వర్యవంతుడుగాను, చూసట్టిముదిమిచే నంగములు సడలి, ముడతలు గల్గిన దేహముతో నటుడాట తుదను తెరలోనికి బోవునట్లు సంసారముచివర యమపురద్వారముసొచ్చి మఱుగుపడుచున్నాడు.

# యతినృపతిసంవాదవర్ణనము.

శ్లో. త్వం రాజా వయమప్యుపాసితగురుప్రజ్ఞాభిమానోన్నతాః
ఖ్యాతస్త్వం విభవై ర్యశాంసి కవయో దిక్షుప్రతన్వంతినః
ఇత్థం మానధనాతి దూరముభయో రప్యావయో రంతరం
యద్యస్మాసు పరాఙ్ముఖోసి వయమప్యేకాంతతో నిస్స్పృహాః 51

ఉ. రాజవు నీవు మేము గురు ♦ రాట్కలితప్రతిభాభిమాన వి
భ్రాజి మహోన్నతాత్ములము ♦ భవ్యధనప్రథితుండ వీవు స
ద్రాజి నుతించు మాయశము ♦ దవ్వుసుమీ మనవాసిమమ్ము ని
ర్వ్యాజత జూడవేని యను♦రాగము మాకును లేదు నీయెడన్. 51

తా. నీవు మహారాజువు. మేము గురుముఖముగా బడసిన ప్రజ్ఞావిభవముచే పేరొందిన వారము. నీవైశ్వర్యవంతుడవగుటచే ప్రసిద్ధుడవు. మాకీర్తి కవులచే వర్ణింపబడుచు దిశాంతముల చూరగొనుటచే మేము గూడ ప్రసిద్ధులమే కనుక నీకు మాకును విశేషతారతమ్యములేదు కాబట్టి మాయెడల ననాదరముగా మెలగినచో నీయెడల మేమును ననాదరముగా వర్తించెదము మేము విరక్తులము గాన నీయనాదరము మమ్ముల బాధింపదు సుమా

శ్లో. అర్థానా మీశిషే త్వం వయమపి చ గిరామీశ్మహే యావదర్థం
శూర స్త్వం వాదిదర్పవ్యుపశమనవిధా వక్షయం పాటవం నః
సేవంతే త్వాం ధనాఢ్యా మతిమలహతయే మామపి శ్రోతుకామా
మయ్యప్యాస్థా న తే చేత్త్వయి మమ సుతరామేష రాజన్గతోస్మి 52

చ. ధనపతి నీవు మేము విబు ♦ ధశ్రుతిపుంజపదార్థతత్త్వశా
సనులము నీవు శూరుఁడవు ♦ చండతరప్రతివాదిగర్వభం
జనులము మేము నిన్ను ధన ♦ శాలురు మమ్ము భజింతురాశ్రితుల్
వినయము సేయవేని పృథి ♦ వీవర సాగెద మీక్షణంబునన్. 52

తా. రాజా! నీవు ధనములకు రాజువు మేము సర్వశాస్త్రములకు రాజులము. వైరుల నీవడంచుటచె శూరుడవు మేము ప్రతివాదుల నడంచెడి శూరులము ధనాశాపరులు నిన్ను సేవింతురు. శాస్త్రశ్రవణము గోరువారు మమ్ము గొలుతురు. కావున నీకు మాకు భేదమేమియు లేదు మమ్మనాదరణముగా జూచినచో వేఱొండుచోటునకు బోయెదము

శ్లో. వయ మిహ పరితుష్టా వల్కలై స్త్వం దుకూలై
స్సమఇవ పరితోషోనిర్విశేషో విశేషః
సతు భవతి దరిద్రో యస్య తృష్ణా విశాలా
మనసి చ పరితుష్టే కోర్థవాన్ కో దరిద్రః. 53

చ. కలితదుకూలవస్త్రములు ♦ గట్టిననీకును జీర్ణవల్కలం
బులుధరియించుమాకునుబ్ర ♦ మోదముతుల్యములేదు వాసి యు

గ్గల మగుతృష్ణ యెవ్వనికి ♦ గాఢదరిద్రుడు వాడు లేమియుం
గలిమియు నేలసమ్మదవి ♦ కస్వరమానసులైనవారికిన్. 53

తా. నారచీరలు ధరించుమేము, కాంచనపీతాంబరముల ధరించు నీవును మన ముభయులము సమాన సంతోషులమేగదా? దవ్యాసగలవానికి దారిద్ర్యముగాని మన స్సంతుష్టిగలవానికి దవ్యమక్కరలేదు దారిద్ర్యములేదు.

శ్లో. ఫలం మల మశనాయ స్వాదు పానాయతోయం
క్షితి రపి శయనార్థం వాససే వల్కలంచ
నవధనమధుపాన భ్రాంతిసర్వేంద్రియాణా
మవినయ మనుమన్తుం నోత్సహే దుర్జనానాం. 54

చ. ఫలములుచాలు జీవికకు ♦ బానముసేయ జలంబుజాలు వ
ల్కలములుజాలు కట్టుట కి ♦ లాతలముల్ శయనింపజాలుని
మ్ఫలనవవిత్త శీధురస ♦ పానవిజృంభిత మోహలీన చి
త్తులగు నికృష్టభూతుల ♦ దుర్నయమిం చుకయున్ సహింతునే.

తా. ప్రాణాధారమునకు పండ్లుచాలును. దప్పితీర్చుకొనుటకు తియ్యని జలము చాలును. కట్టుకొనుటకు నారచీరెలు చాలును. నిద్రించుటకు భూమి చాలును. మదిర పానపరిమత్తులగు రాజుల నికే సౌఖ్యముకై యాశ్రయించ వలయును.

శ్లో. అశ్నీమహి వయ భిక్షాం, మాశావాసో వసీమహి
శయీమహి మహీపృష్ఠే, కుర్వీమహికి మీశ్వరైః. 55

గీ. చేరిభిక్షాన్న మారగిం ♦ చెదము మేము
కట్టెదము దిక్కు లనియెడి ♦ కలితశాటి
బవ్వళించెద మిలయను ♦ పాన్పుమీద
నేమికార్యముమాకు న ♦ రేంద్రులందు. 55

తా. భిక్షాన్నము భుజించెదము. దిక్కుల వస్త్రముగా గట్టుదుము అవని పాన్పున బవ్వళించెదము. ఇట్టిమాకు రాజులతో బనియేమి?

శ్లో. న నటా న విటా న గాయకా, న చ సభ్యేతరవాదచుంచవః
నృపమీక్షితు మత్రకేవయం, స్తనభారా నమితానయోషితః 56

క. విట గాయక వైతండిక
నటజనులముగాము పృథుఘ ♦ నస్తన నమితో
త్కట వారకాంతలము గా
మటుగావున నృపునిజూడ ♦ నగునే మాకున్. 56

తా. మేము విటులము, వితండవాదులము, గాయకులము, నటకులము, మన్మ ధాగ్నివడంచు బలితంపు గబ్బిగుబ్బలు గలిగిన వారకాంతలము గాము. కావున మేము రాజుపాలికి బోనక్కర లేదు.

శ్లో. విపులహృదయైర్ధన్యైః కైశ్చి జ్జగ జ్జనితం పురా
విధృత మపరై ర్దత్తం చాన్యై ర్విజిత్య తృణం యథా
ఇహ హి భువనాన్యన్యే ధీరా శ్చతుర్దశ భుంజతే
కతిపయపురస్వామ్యే పుంసాం క ఏష మదజ్వరః 57

ఉ. అంచితబుద్ధులైనమను ♦ జాధిపతుల్ జగమెల్ల దొల్లి ని
ర్మించిరి దానిఁ గొందఱు భ ♦ రించిరి యిచ్చిరి గొంద ఱర్థికి
న్మించి జగంబులన్నియును ♦ నెమ్మిభుజించుచుఁగొంద ఱుండగా
బంచమపట్టణేశుల క ♦ వార మదజ్వరమింత యేటికిన్. 57

తా. ప్రపంచమంతయు నుదారమనస్కులతో సృష్టింప జేయబడినది. అటు తర్వాత కొందరిచే పాలింపబడినది. అటుపిమ్మట గొందఱిచే జయింపబడి తృణమట్లు దానము చేయబడినది. ఇఁక నిప్పుడు గొందఱు ధీరులు సమస్తలోకముల పాలింపుచు న్నారు. ఇదంతయు నట్లుండ నేవోనాలుగైదు పట్టణంబులేలు వారలింత మదాంధులై కన్నుమిన్నుగానక చరించు టెందుకో?

శ్లో. అభుక్తాయాం యస్యాం క్షణమపి న యాతం నృపశతై
ర్భువ స్తస్యా లాభే కఇవ బహుమానః క్షితిభృతామ్

తదంశస్యా ప్యంశే తదవయవలే శేపి పతయో
విషాదే కర్తవ్యే విదధతి జడాః ప్రత్యుత ముదం. 58

చ. ఎడ నిమిషంబులేక ధర ♦ నీశశతంబు భుజించు చున్నయి
ప్పుడమి లభించినన్ మహిమ ♦ పొందునె రాజుల నేల తున్కలో
నడరు లవంబులోఁ దునియ ♦ యందొకమూలకు సాధులైన వా
రడలక వైపరీత్యమున ♦ వార్షము జెందుదు రెంత మందులో. 58

తా భూమిని రాజులేలని క్షణము లేదు. ఏరాజో యొకరాజు భూమిని పాలించుచునే యున్నాడు అట్టిరాజునకే యతిశయము లేనప్పుడు అట్టిభూమిలో సహస్రాంశముతోని యొకమూలకు ప్రభువైన తానేమి గొప్పవాడనని పగచుటకు మూరుగా యుబ్బొందెదరు. ఆహా ఏమి! వీరికింత యవివేకము?

శ్లో. మృత్పిండో జలరేఖయా వలయిత స్సర్వోప్యయం న న్వణుః
స్వాంశీకృత్య సఏవ సంయుగశతై రాజ్ఞాం గణై ర్భుజ్యతే
నో దద్యుర్దదతేథవా కిమపి తే క్షుద్రా దరిద్రా భృశం
ధిగ్ధిక్తాన్ పురుషాధమాన్ ధనకణం వాంఛంతి తేభ్యోపి యే. 59

చ. తగ జలరేఖచే వలయి ♦ తంబగు కొంచపు మంటిముద్దకై
జగడము లాడి యాడి పెలు ♦ చన్ విభజించి భుజించు చున్న దు
ర్భగ నృపులిచ్చువారె తలఁ ♦ పం గడునీచులు వారియందు నొ
ప్పుగ ధనలేశ కాంక్షగల ♦ పూరుషులుం గడు హీనులేకదా. 59

తా. భూమియంతయు జలరేఖచే చుట్టుకొనబడి యున్నది. అట్టి భూమికై రాజులు తమలోదాము పోట్లాడుకొని తమకై విభజించుకొని యనుభవించుచున్నారు వారా మట్టిపెళ్ళకై పోరాడినవారు గనుక క్షుద్రులు. అదియు పూర్ణముగాలేక కొంతభాగమునే పొందుటవలన దరిద్రులు కావున వారు ఇదివరకు పెట్టియుండలేదు. ఇప్పుడు పెట్టరు. ముందు పెట్టబోరు అట్టివారిని యాచించువారు వారికంటె నీచులుగాన నిందింపదగినవారు.

శ్లో. న జాతః కోప్యాసీ న్మదనరిపుణా మూర్ధ్ని ధవళం
కపాలం యస్యోచ్చై ర్వినిహిత మలంకారవిధయే
నృభిః ప్రాణత్రాణప్రవణమతిభిః కైశ్చి దధునా
నమద్భిః కః పుంసా మయ మతులదర్పజ్వరభరః 60

చ. అతడ సుజన్ముఁ డెవ్వనిన ♦ మాంచితశుభ్రకపాల మద్రిజా
పతి కుతుకంబుతోడఁ దల ♦ పై ధరియించె విభూషణంబుగా
క్షితిపయి ప్రాణరక్షణము ♦ చేయుటకై తముజేరి కొంద ఱా
నతు లయి రంచు దుర్మదపు ♦ నజ్వర మేటికి మానవాళికిన్. 60

తా. ఎవ్వాని ధవళంపుపుఱుకను ఈశ్వరు డానందముతో ధరించెనో యాతడే సార్థక జన్ముడు. అట్టిస్థితియందు భూమియందు ప్రాణరక్షణోపాయముగా గొందరు తమ్ముం జేరి వినమ్రులై నంతమాత్రాన దోషయుక్తమగు గర్వమునేల పెద్దరోగమెందులకు పొందితోగదా?

# మనస్సంబోధననియమనము.

శ్లో. పరేషాం చేతాంసి ప్రతిదివస మారాధ్య బహుధా
ప్రసాదంకిం నేతుం విశసి హృదయ క్లేశకలిలం
ప్రసన్నే త్వ య్యంత స్స్వయ ముదితచింతామణిగుణే
విముక్త స్సంకల్పః కి మభిలషితం పుష్యతి నతే. 61

చ. పరులమనంబు లోలిబహు ♦ భంగులఁ గొల్చి ప్రసన్న తాగుణ
స్ఫురణ వహింపఁ జేయుటకు ♦ బూనగ నేటికి నీవు చిత్తమా
స్థిరముగ సుప్రసాదము భ ♦ జించి నిలింపమణీగణోదయ
స్ఫురితగతిన్ మనోరథము ♦ సొంపువహింపదె నీకుమేలుగన్. 61

తా. ఓమానసమా! ఇతరులగొలిచి వారలను ప్రసన్నులుగా చేసికొనుటకు యత్నించెదవే! నీవే స్వచ్ఛమయిన చింతామణివంటి గుణము లలవరచుకొంటివేని కోరికలన్నియు పొందగలుగుదువు. కావున నితరుల గొలువకుము.

శ్లో. పరిభ్రమసి కిం వృధా క్వచన చిత్త విశ్రామ్యతాం
స్వయం భవతి య ద్యధా భవతి తత్తధా నాన్యధా
అతీతయమనుస్మర న్నపి చ భావ్యసంకల్పయ
న్నతర్కితసమాగమా ననుభవాని భోగానహం. 62

ఉ. ఏల పరిభ్రమించెద వ ♦ నేకవిధంబుల వెఱ్ఱిచిత్తమా
తాలిమి విశ్రమింపు మొక ♦ తావున యత్నము లేకయే యగున్
మేలును గీడు నేఁ దలఁప ♦ మించినకార్యము భావికార్యముల్
లాలసవృత్తి ఁ గోర విధి ♦ లబ్ధఫలంబులు నే భుజించెదన్. 62

తా. మనసా! నాకై యనేకవిధములుగా నలుగడల భ్రమించెదవు ఏది యెట్లు జరుగవలయునో యట్లు జరిగితీరును. అన్యథా జరుగదు కాన నీప్రయత్నముచే నా కేమియు విశేషము కలుగదు. దైవికముగా వచ్చిన భోగములనే బొంది సుఖింతును.

శ్లో. ఏతస్మా ద్విర మేంద్రియార్థగహనా దాయాసకా దాశ్రయ
శ్రేయోమార్గ మశేషదుఃఖశమనవ్యాపారదక్షంక్షణాత్
శాంతం భావ ముపైహి సంత్యజ నిజాం కల్లోలలోలాం గతిం
మా భూయో భజ భంగురాం భవరతిం చేతః ప్రసీ దాధునా. 63

శా. ఆయాసప్రద మింద్రియార్థగహనం ♦ బాతోఁవ వర్జింపుమీ
శ్రేయోమార్గము సర్వదుఃఖనికర ♦ చ్ఛేదార్థ మై చేరుమీ
ధ్యేయాద్వైతముఁ బొందుమీ స్థిరతచే ♦ దీపింపుమీ చిత్తమా
మాయాకేళికి వెండియుం జొరకుమీ ♦ మాలిన్యముల్ వీడుమీ. 64

తా. ఓమనస్సా! సర్వానర్థముల కాలవాలమైన యింద్రియముల నడంచి జ్ఞానమార్గమున బ్రవర్తింపుము. గంభీర హృదయముతో నాత్మస్వరూపముఁ గనుచు, యతిచంచలమగు నీవృత్తి విడచి నిత్యముకాని యీసంసారమును విడిచి ఆనందాంబుధిలో నోలలాడుమా!

శ్లో. మోహం మార్జయ తా ముపార్జయ రతిం చంద్రార్ధచూడామణౌ
చేత స్స్వర్గతరంగిణీతటభువా మాసంగ మంగీకురు

కోవా వీచిషు బుద్బుదేషుచ తటిల్లేఖాసుచ స్త్రీషుచ
జ్వాలాగ్రేషుచ పన్నగేషుచ సరిద్వేగేషుచ ప్రత్యయః. 64

చ. దురితపుమోహముం దొలఁగఁ ♦ జేయుముసేయుముభక్తి శూలిపై
వరసురవాహినీతటని ♦ వాసము జేకొనుమేటినమ్మికల్
తరగలయందు బుద్బుదవి ♦ తానములందు మెఱుంగుదీగెలం
దరయఁగఁ గీలలందు ఫణు ♦ లందు సుహృజ్జనులందు డెందమా. 64

తా. ఓమానసమా! నీకొకమాట జెప్పెదవినుము. మోహవికారము దొలంగ జేయుము సతతము శివధ్యానతత్పరుండవై గంగాతీర ప్రదేశమునందు వాసము జేయుము. వనితలుగాని, సంపదలుగాని, తరంగములవలెను, నీటిబుడగవలెను, మెఱపుదీగవలెను, నిప్పుకొనవలెను, సర్పమువలెను, నదీవేగమువలెను, చంచలమయినవి. కావున వానినెంతమాత్రము నమ్మదగదు.

శ్లో. చేత శ్చింతయ మా రమాం సకృ దిమా మస్థాయినీ మాస్థయా
భూపాలభ్రుకుటీకుటీవిహరణవ్యాపారపణ్యాంగనాం
కంథాకంచుకితాః ప్రవిశ్య భవనద్వారాణివారాణసీ
రథ్యాపంక్తిషు పాణిపాత్రపతితాం భిక్షామపేక్షామహే. 65

మ. అవనీశభ్రుకుటీకుటీవిహరణ ♦ వ్యాపారపణ్యాంగనన్
భువిలో సంపద నించుకం గొనకుమీ ♦ భోగార్థమై చిత్తమా
శివమోదావహకాశికానగరసు ♦ శ్రీరాజమార్గంబులన్
భవనద్వారములందుఁ జేతసిడుచ ♦ భైక్షం బపేక్షించెదన్. 65

తా. మానసమా! రాజానుగ్రహముచే గలుగుచు, నిగ్రహముచే బోవుచు, వెలలందివలె చంచలమయిన లక్ష్మికాశించి మమ్మలయింపకుము మేము చింకిబొంతగప్పుకొని కాశీపురమున బిచ్చమెత్తుకొని బ్రతుకవలయునని కోరిక యున్నదిసుమా!

శ్లో. అగ్రే గీతం సరసకవయః పార్శ్వయో ర్దాక్షిణాత్యాః
పశ్చా ల్లీలావలయరణితం చామరగ్రాహిణీనాం

యద్యస్త్యేవం క్షురుభవరసాస్వాదనే లంపటత్వం
నో చే చ్చేతః ప్రవిశ సహసా నిర్వికల్పే సమాధౌ. 66

చ. సరసులు దాక్షిణాత్యకవి ♦ చంద్రులు చెంతలయందుముందటన్
సురుచిరగీతమున్ వెనుక ♦ శోభిత చామర పాణిమానినీ
కరమణికంకణక్వణముఁ ♦ గల్గిన యేని భవానుభూతిచే
బరగుము గల్గవేని భవ♦ భంజన యోగముఁ బూను మానసా. 66

తా. ఓమనస్సా! సరస వచన రచనా ధురంధురులగు కవిపుంగవులును, వీణాది వాద్యముల వాయించు గాయకులును, వెనుకదెస వింజామరల వీచెడి చెలియల కంకణక్వణములు మొదలగునవి యుండినచో సంసారసుఖ మనుభవింపుము. లేదా తత్క్షణమే నిర్వికారుడవై నిర్వికల్పసమాధిం జేకొని పరబ్రహ్మ పదార్థము జూడుము.

శ్లో. ప్రాప్తా శ్శ్రియ స్సకలకామదుఘా స్తతః కిం
న్యస్తం పదం శిరసి విద్విషతాంతతః కిం
సంపాదితాః ప్రణయినో విభవై స్తతః కిం
కల్పంస్థితం తనుభృతాం తనుభి స్తతః కిమ్. 67

చ. సకలశుభంబు లిచ్చుప్రియ ♦ సంపద వచ్చిననేమి దానిచే
బ్రకట విరోధి మస్తకము ♦ పైఁబదముంచిన నేమి దానిచే
నికట ధనంబుచే హితుల ♦ నేర్పుగ నేలిన నేమి దానిచే
వికృతము గాక ప్రాణికి భు ♦ విం దనువుండిన నేమి దానిచేన్. 67

తా. ఓమానసమా! మనుజులకు కాంక్షల, కోడగూర్చు సంపదలుండినను, వైరులు పాదాక్రాంతులైనను, స్నేహితుల కెక్కుండఁ సంపాదించినను దేహము కల్పాంతము వరకుండినను నివియన్నియుం నిత్యశ్రేయ మార్గములు గావు కనుక వైవాటిచో బనిలేదు.

శ్లో. భక్తి ర్భవే మరణజన్మభయం హృదిస్థం
స్నేహో న బంధుషు న మన్మథజా వికారాః

సంసర్గదోషరహితా విజనా వనాంతా
వైరాగ్య మస్తి కిమితః పర మర్థనీయం. 68

చ. హరచరణాబ్జయుగ్మమున ♦ నంచితభక్తి మనంబులో జరా
మరణభయంబు బాంధవస ♦ మాజముపై స్పృహలేమి దుస్సహ
స్మరశరనిగ్రహంబు ముని ♦ మాన్యపవిత్రవనప్రదేశముల్
పరమవిరక్తియుం గలుగ ♦ భాగ్యమహోన్నతి చేసియున్నదే! 68

తా. ఓమనసా! శంభుభక్తియు, జరామరణములందు భయమును, భార్యాపుత్రాదులందు విరక్తియు, మన్మథవికారము నణంచుటయు, నిర్జనములగు వనప్రదేశములు గోరవలయును. అందువలన వైరాగ్యము వచ్చును. వైరాగ్యమువంటి శ్రేయస్సాధనము మరియొకటి లేదుగదా?

శ్లో. తస్మా దనంత మజరం పరమం వికాసి
తద్బ్రహ్మ చింతయ కి మేభి రసద్వికల్పైః
యస్యానుష గిణ ఇమే భువనాధిపత్య
భోగాదయః కృపణ లోకమతా భవంతి. 69

తే. గీ. కావున ననంత మజర మ ♦ క్షర మజంబు
బ్రహ్మము భజింపు మతివిక ♦ ల్పములు వలదు
బ్రహ్మసంగికి భువనాధి ♦ పత్యభోగ
పదవియును నీరసం దుచ్ఛమె ♦ పరగు జువ్వె. 69

తా. కావున ఓమానసమా! యనంతమైనదియు నశ్వరత్వనష్టమైనదియు సకలపరిదేశముల నావరించియుండు బ్రహ్మమును జింతింపుము. అనవసర చింతలేల? ఆ బ్రహ్మమునకు పరతంత్రుడైనవానికి సమస్తలోకాధిపత్యము తదితరముల వలెను యోగ్యమైనవి గాదోచును. గాని తనకు దగినట్లు గోపదు.

శ్లో. పాతాల మావిశసి యాసినభో విలఘ్య
దిఙ్మండలం భ్రమసి మానసి మానస చాపలేన

భ్రాంత్యాపి జాతు విమలం కథ యాత్మనీనం
తద్బ్రహ్మ న స్మరసి నిర్వృతి మేషి యేన. 70

చ. బలిసదనంబు జొచ్చెదవు ♦ ప్రాకెద వభ్రపదంబు దాటి ది
గ్వలయము సంక్రమించెదవు ♦ వారిక చిత్తమ చాపలంబునం
దలప వొకప్పుడుః మఱచి ♦ తప్పియు లోన వెలుంగుబ్రహ్మము
న్దలచెదవేని పొందెదవు ♦ నాశవివర్జితనిత్యసౌఖ్యమున్. 70

తా. ఓమనస్సా! పాతాళలోకము జొచ్చెదవు. ఆకసంబును గడచిపోయెదవు. దిగాంతముల జూరగొనెదవు నీకట్టి గమనశక్తి గల్గినను వివేకముచే గాకపోయినను భ్రమకలిగియైన నీవేళ యుండైను యాత్మప్రకాశమైయున్న పరబ్రహ్మమును స్మరింప వేందులకు? పరబ్రహ్మచింతనముచే యాత్మతృప్తి నొంది యుండునుగదా.

# 9 నిత్యానిత్యవస్తువిచారము.

శ్లో. కిం వేదైః స్మృతిభిః పురాణ పఠనైః శ్శాస్త్రైర్మహావిస్తరైః
స్వర్గగ్రామకుటీనివాసఫలదైః కర్మక్రియావిభ్రమైః
ముక్త్వైకం భవదుఃఖభారరచనావిధ్వంసకాలానలం
స్వాత్మానందపదప్రవేశకలనం శేషా వణిగ్వృత్తయః. 71

ఉ. శ్రీమహితశ్రుతిస్మృతుల ♦ చే బహుశాస్త్రపురాణయుక్తి చే
నేమిఫలంబు లౌక్యజన ♦ వృత్తికి నీ దగు నిర్జరాలయ
గ్రామకుటీనివాసఫల ♦ కర్మముచే ఫలమేమి జన్మదుః
ఖామయభేషజాత్మయమ ♦ హాసుఖ మొక్కటి దక్క నన్నిటన్.

తా. వేద, శాస్త్ర, శ్రుతి, స్మృతి, పురాణాది సద్గ్రంథపఠనవలనగాని, స్వర్గము వశమగు పల్లెటూరుయందుండి స్నానాది నిత్యకర్మల నిర్వర్తించినను, నిష్ప్రయోజనమేగాని ప్రయోజన మావంతయు లేదు. పూర్వకర్మల వలనగలుగు సంసార దుఃఖ

సమూహములు గాలాగ్నివోలె పోగొట్టునది యాత్మస్వరూపానందానుభవము పొందుట యొక్కటియేదక్క మిగిలినవన్నియు వ్యర్థములుగదా?

శ్లో. యదా మేరు శ్శ్రీమా న్నిపతతి యుగాంతాగ్ని వలితః
సముద్రా శ్శుష్యంతి ప్రచురమకరగ్రాహనిలయాః
ధరా గచ్ఛ త్యంతం ధరణిధరపాదై రపిధృతా
శరీరే కా వార్తా కరికలభకర్ణాగ్రచపలే 72

చ. స్థిరతరమైన మేరువు న ♦ శించు యుగాంత కృశాను కీలలన్
వరమకరాకరంబు లగు♦వారినిధానములెల్ల నింకు భూ
ధరములచే ధరింపబడి ♦ ధారుణి పోడిమి దప్పుగావునన్
కరి కలభశ్రవచ్చపల ♦ కాయమునం దిక వార్తలేటికిన్. 72

తా. స్థిరమయిన మేరుపర్వతము ప్రళయాగ్నియందు నీరగుచున్నది సర్వజల జంతువుల కాటపట్టయిన మహాసముద్రము ప్రళయాగ్నివలన నెండిపోవు చున్నది. సప్తకుల పర్వతములపై నిలచియున్న భూమి నాశన మగుచున్నది. ఇట్టివానికే చంచలము కలిగియుండగా నేనుగు పిల్ల చెవికొనవలె నతిచంచలమగు కాయము నశింపదని యాయూహ?

శ్లో. గాత్రం సంకుచితం గతి ర్విగళితా భ్రష్టాచ దంతావలి
ర్దృష్టి ర్నశ్యతి వర్ధతే బధిరతా వక్త్రంచ లాలాయతే
వాక్యం నాద్రియతే చ బాంధవజనో భార్యా న శుశ్రూషతే
హా కష్టం పురుషస్య జీర్ణవయసః పుత్రోఽప్యమిత్రాయతే.

చ. తనువు ముడుంగు బాదగతి ♦ దప్పును దంతము లూడు జీకటుల్
గనుగవ వర్తిలుం జెవుడు ♦ గ్రమ్మును జొంగలు గారు మోమునన్
జనములు మాట చేకొనరు ♦ సన్నిధి జేరదు భార్య పుత్రుడుం
గానకొని శత్రువట్ల తిరు ♦ గుం గడుఁగష్టము వృద్ధదేహికిన్. 73

తా వృద్ధత్వమునందు దేహము ముడుచుకొనును నడక తొట్రిల్లుచున్నది. పండ్లూడి పోవుచున్నవి చత్వార మావహించుచున్నది. బధిరత్వము బాధించుచున్నది.

నోటినుండి జొల్లు గారుచున్నది బంధువులు జెప్పిన మాట నాలకింపదు భార్య గొలువుఁజేయదు. కన్న కుమారుడు పరవశత్రువగును ముదుసలి కష్టము వర్ణించుట యాది శేషునకైన తరము గాదుగదా?

శ్లో. వర్ణంసితంశిరసివీక్ష్యశిరోరుహాణాం
స్థానంజరాపరిభవస్య తదాపుమాంసమ్
ఆరోపితాస్థిశకలం పరిహృత్యయాన్తి
చండాలకూపమివదూరతరంతరుణ్యః. 74

ఆ. కురులతెలుపుఁజూచి ♦ కొఱగాఁడు వీఁడని
ముసలివాని విడిచి ♦ ముదితలెల్ల
దూరముఁ దొలంగు ♦ దురుసాస్థిశకలమా
మాలనూతివిడిచి ♦ మలఁగుభంగి. 74

తా కాంతలు వృద్ధుని నెరసిన కేశంబుల పరికించి వీడు పాత్రుడు కాడనివిడచి పంచముల నీరువాడు నూతి చిక్కట్లు విడచి దూరముగా పోదురు

శ్లో యావత్స్వస్థ మిదం కళేబరగృహం యావచ్చ దూరే జరా
యావ చ్చేంద్రియశక్తి రప్రతిహతా యావత్క్షయో నాయుషః
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహా
న్ప్రోద్దీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః 75

చ. ధృతిగొని రోగముల్ జరయు ♦ దేహము నొంపకముందెయి ద్రియ
ప్రతిహతి లేకము దె తన ♦ ప్రాణ విరామము కాకముందె పం
డితజనుఁ డాచరింపఁదగు ♦ శ్రేయఃప్రయత్నము ముక్తికై మహో
ద్ధతశిఖ నిల్లు గాలుతఱిఁ ♦ దాలిమి నూతులు ద్రవ్వటొప్పునే 75

తా శరీరము రోగములు లేక యెంతకాలము బలీయముగా యుండునో యెంత కాలము వృద్ధత్వము రాక యుండునో యింద్రియములు పటుత్వముందాక పెంపు యుండునో, ఆయువెంతకాలము క్షీణింపక యుండునో యంతలోపలనే తనశ్రేయ

స్సాధనమునకు గడంగవలయును. ఎట్లు ప్రథమమున ప్రయత్నించక అంత్యదశయందు ప్రయత్నించినచో యిల్లు కాలుచుండగా నూయి త్రవ్వినట్లగును.

శ్లో. తపస్యంతస్సన్తః కిమధినివసామస్సురనదీం
గుణోదారాన్దారానుత పరిచరామస్సవినయం
పిబామశ్శాస్త్రౌఘానుత వివిధకావ్యామృతరసా
న్నవిద్మః కింకుర్మః కతిపయనిమేషాయుషిజనే. 76

మ. తపముల్ సేయుచు దేవతాతటిని చెం ♦ తన్ నిల్తుమో కాక దా
రపరత్వంబుననుందుమో వివిధశా ♦ స్త్రశ్రేవ్యకావ్యామృతం
బుపభోగింతుమొ యేమిసేతుమొహితం ♦ బూహింపఁగా లేమని
త్యపులోకంబున మానవుల్ మితనిమే ♦ షాయుష్కులై యుండగన్.

తా. వరుల స్థిరమగు జగంబున పరిమితితోఁగూడిన కొన్నిరెప్పపాటుల కాల మాయువుఁగలిగియుండుటంబట్టి తపంబొనర్చుచు గంగానదీతీరమునందుందుమా! లేక యనేకశాస్త్రములు వినదగిన కావ్యములు ననెడి యమృతము ననుభవించుచుందుమా! ఇందేది చేయుటకును నిష్టమయినదానిని నిర్ణయింపజాలము.

శ్లో. దురారాధ్యాశ్చామీ తురగచలచిత్తాః క్షితిభుజో
వయం తు స్థూలేచ్ఛా స్సుమహతి పదే బద్ధమనసః
జరా దేహం మృత్యుర్హరతి దయితం జీవితమిదం
సఖే నాన్యచ్ఛ్రేయో జగతి విదుషో న్యత్రతపసః. 77

ఉ. వాజిచలస్వభావు లగు ♦ వారు ప్రసన్నులుగారు భూపతుల్
రాజసవృత్తి మానరు దు ♦ రాశయు నెక్కుడు మాకు సొమ్ముపై
దేజమడంచు వృద్ధదశ ♦ దీకొని ప్రాణము నొంచుఁ గాలుఁడు
వ్యాజతపంబు కన్న భువి ♦ నాత్మహితంబగు కృత్యమున్నదే. 77

తా. వాజివలె నిలుకడలేని మనస్సులుగలిగిన రాజుల యనుగ్రహము సంపాదించుట యెంతయు గష్టము. మనకు యాశయత్యధికమై గొప్పపదవులు గావలయును





మన స్సువిస్ఫూరుచుండును వృద్ధత్వ మాక్రమించి దేహము జీర్ణింపఁ జేయుచున్నది. అత్యంత ప్రియమగు ప్రాణమును మృత్యువు వెన్నాడుచున్నది. కావున నో శ్రేష్ఠ కాఁడా బుద్ధిమంతులకు తపస్సే శ్రేయస్సాధనమని యెఱుంగవలెను.

శ్లో. మానేమ్లాయినిఖండితే చవసునివ్యర్థం ప్రయాతేర్థిని
క్షీణేబంధుజనే గతే పరిజనేనష్టేశనైర్యావనే
యుక్తం కేవలమేతదేవ సుధియాంయజ్జహ్నుకన్యాపయః
పూతగ్రావగిరీంద్ర కన్దరదరీకుంజే నివాసః క్వచిత్. 78

ఉ. మానము గ్రుంగఁగా ధనము ♦ మట్టముగా నిజబాంధవాశ్రితుల్
దీనతఁజెందిపోఁగ నతి ♦ ధిప్రకరంబు నిరాసమైజనన్
మానుగజవ్వనం బరుగ ♦ మాన్యునకుండగు జహ్నుకన్యకా
నూనతరంగ పూతశిలి ♦ తోపల శైలనికుంజ వాసముల్. 78

తా. మనోబలంబు పోవురీతి డబ్బు తగ్గుఁట్లు తనచుట్టములు నాశ్రితులు దైన్య తతోఁ జనునట్లు యాచక సమూహ మాసవిడుచుకొని పోవునట్లు జవ్వనము వెడలు నట్లును బూజ్యుఁడగువాఁడు గంగానదియొక్క యాధిక మైన యలలచేత బవిత్రమయిన ట్టియు మనోహర మయినట్టియు శిలలందు కొండలందు బొదరిళ్ళయందు నుండతగును.

శ్లో. రమ్యా శ్చంద్రమరీచయ స్తృణవతీ రమ్యా వనాంతస్థలీ
రమ్యం సాధుసమాగమాగతసుఖం కావ్యేషు రమ్యాః కథాః
కోపోపాహీంతబాష్పబిందుతరళం రమ్యం ప్రియాయా ముఖం
సర్వం రమ్య మనిత్యతా ముపగతే చిత్తే న కించిత్పునః. 79

ఉ. మంచివి పండువెన్నెలలు ♦ మంచివి పుష్పవనప్రదేశముల్
మంచిది సాధుసంగమస ♦ మాగతసౌఖ్యము చాటువాక్యముల్
మంచివి మంచి దశ్రుయుత ♦ మానవతీముఖ మీాసమస్తమున్
మంచిది గా దనిత్య మని ♦ మానసవృత్తి నెఱుంగువారికిన్. 79

తా. చంద్రుని వెన్నెలలు, పచ్చగాయుండు నడవికట్టులు సజ్జనస్నేహమువలని సుఖము, కావ్యములందలి కథలును, ప్రణయుంపు గోపమువలన వచ్చినకన్నీటి బిందు

వుతోఁ గూడిన ప్రియురాలిసాంగత్యమును, నివియన్నియును రమ్యకృత్యంబులేయగును. కాని యవి యనిత్యమని దోఁచెనా యవిరమ్యములు కానేరవు.

శ్లో. రమ్యం హర్మ్యతలం న కిం వసతయే శ్రావ్యం న గేయాదికం
కిం వా ప్రాణసమాసమాగమసుఖం నైవాధికప్రీతయే
కింతు భ్రాంతపతంగపక్షపవనవ్యాలోలదీపాంకుర
చ్ఛాయాచంచల మాకలయ్య సకలం సంతో వనాంతం గతాః. 80

ఉ. సంతతమున్ సుఖం బొసగ ♦ జాలవె చాల విశాలసౌధముల్
కాంతలసంగమున్ మధుర ♦ గానముల్ వివరించిచూడ సం
భ్రాంతపతంగపక్షభవ ♦ మారుతఘాతవిధూతదీపికా
కాంచిచలంబు సర్వమని ♦ కానల కేగిరి పండితోత్తముల్. 80

తా. సుఖకాలక్షేపమునకు మంచి రమ్యహర్మ్యంబులును, శ్రవణానందమగు గానములును, మిగుల సంతుష్టి నందుటకు గబ్బిగుబ్బలుగల జవరాండ్ర సంగమసుఖంబును, సుఖంబులు కానేరవు. అందుచే సుజనులును, మిడుతల యీకల గాలిచే జలించు దీపమువలె నివియన్నియు జంచలములని కాననములకు బోయిరి.

---

## 10 శివార్చనము.

శ్లో. ఆసంసారం త్రిభువన మిదం చిన్వతాం తాత తాదృ
఼్నైవాస్మాకం నయనపదవీం శ్రోత్రమార్గం గతో వా
యోఽయం ధత్తే విషయకరిణీగాఢరూఢాభిమాన
క్షీబస్యాంతఃకరణకరిణ స్సంయమాలాన లీలామ్. 81

మ. తగ సంసారము నాదినుండియును ద ♦ త్తత్కర్మసంయుక్తి ము
జ్జగముం ద్రిమ్మరు మాకుఁ గానఁబడఁ డే ♦ చందంబునం గర్ణమా

శా. శాంతారావనిశీథకాలముల భా ♦ స్వత్సాంద్రచంద్రాతపా
క్రాంతస్వచ్ఛమరున్నదీపులినయో ♦ గ్యక్షోణిఁ గూర్చుండి జ
న్మాంతోద్వేగుల మైనమేము శివశి ♦ వ్యాహృతితో నెప్పుడ
త్యంతానందభవాశ్రుసంకులదశా ♦ వాప్తిన్ సుఖం బుందుమో. 85

తా. రాత్రులందు ధ్వనులన్నియు నడఁగిన పిదప ధవళకాంతులతోఁ గూడిన వెన్నెలచే దెల్లగా ప్రకాశిల్లుచున్న గంగానది యిసుకదిన్నెయందు గూర్చుండి మేము సంసారసాగరము దాటశక్యముగానిదని చింతించుచు "శివ శివ శివ" యని ధ్యానించుచు యందుచే గలుగు నానందబాష్పము లుప్పతిల నేత్రములు జాలుకొన్న వారమగుట యెన్నఁడో గదా?

శ్లో. విశీర్ణే సర్వస్వే తరుణకరుణాపూర్ణహృదయా
స్స్మరంత స్సంసారే విగుణపరిణామాం విధిగతిమ్
వయం పుణ్యారణ్యే పరిణత శరచ్చంద్రకిరణా
స్త్రియామా నేష్యామో హరచరణ చింతైక శరణాః. 86

చ. కలధన మంతయున్ సెలవు ♦ గా నిడి నూత్నకృపాప్రపూర్ణచి
త్తుల మయి సంసృతిం గుశల ♦ దూరవిపాకము గాఁగ దైవముం
దలచుచు గానలో శివప ♦ దస్మృతి నిష్ఠుల మై నయింపగా
గలము శరత్ప్రసన్నమిహి ♦ కాకరరమ్యము లైనరాత్రులన్. 86

తా. మేము మెత్తని మానసంబును గలిగి యాచకులకు ధనమంతయు నొసంగి, సంసారమునందు దైవము నేయు కష్టపరంపరల మనమునఁ దలంచుచు వానినిరోసి తపోవనముఁ జేరి శివచరణారవిందయుగళధ్యానమే రక్షణోపాయముగా యుంచుకొని శరదృతువునందలి పండువెన్నెలలతోఁ గూడిన రాత్రుల నానందముతో గడుపుదుము. ఆభాగ్య మెన్నడుగలుగునో తెలియరాదు.

శ్లో. కదా వారాణస్యా మమరతటినీరోధసి వస
న్వసానః కౌపీనం శిరసి నిదధానోంజలిపుటం
అయే గౌరీనాథ త్రిపురహర శంభో త్రినయన
ప్రసీదేతి క్రోశ న్నిమిషమివ నేష్యామి దివసాన్. 87

ఉ. శ్రీనుతకాశియం దమర ♦ సింధువుచెంగట నిల్చి గోచినిం
బూని పరిణామముద్రఁ దల ♦ మోపి పురాంతక పార్వతీశ శం
భో నిటలాక్ష రక్ష యని ♦ మొఱ్ఱలు వెట్టుచు నిశ్చలాను సం
ధానత యెన్న డే గడపె ♦ దక్ దినముల్ నిమిషంబుకై వడిన్. 87

తా. కాశీపురంబున గంగాతీరమున నివసించుచు గోచిని ధరించి తలయుందు జేమోడ్పునుంచి ఓపార్వతీశా! త్రిపుర సంహారణా! హేశంభో! నిటలాక్షా! ప్రసన్నుం డవు కమ్మని బిగ్గరగ నరచెడి దినములు క్షణముపలె గడచిపోవుట యెప్పుడు గలు గునోకదా.

శ్లో. స్నాత్వాగాంగైః పయోభిశ్శుచికుసుమఫలైరర్చయిత్వావిభోత్వాం
ధ్యేయే ధ్యానం నియోజ్యక్షితిధరకుహరగ్రావపర్యంకమూలే
ఆత్మారామః ఫలాశీ గురువచనరత స్త్వత్ప్రసాదాత్స్మరారే
దుఃఖం మోక్ష్యే కదాహం సమకరచరణే పుంసి సేవాసముత్థమ్. 88

ఉ. వేలుపుటేటఁ దోఁగి సుమ ♦ విత ఫలాదులఁ బూజచేసి ని
న్నోలి మనంబులో నిలిపి ♦ యోగ్య గుహాశిలయందు నాత్మ సం
శీలుడనై ఫలాశినయి ♦ శ్రీగురు వాక్యరతుండనై మహీ
పాలక సేవన శ్రమముఁ ♦ బాసెద నెన్నఁడు మన్మథాంతకా. 88

తా. ఎన్నడు గంగాజలంబులందు స్నానమాచరించి, పరిశుద్ధములగు ఫలపుష్పము లతో నిన్ను బూజించి, నీపదారవిందములు ధ్యానించుచు, పర్వతగుహాలందలి రాతి సెజ్జపయి సుఖముగాగూర్చుండి, విషయవాంఛలు మాని, యాత్మస్వరూపమునందే ధ్యానశక్తిగలిగి దేహధారణముకొరకు ఫలమూలంబు లాహారముగాగొని, గురూపదేశ మును సదా ధ్యానించుచు, నావలె సమస్తాయువములుగలిగిన యొకపురుషుని గొలుచు టవలన దుఃఖమును, మన్మథాంతకా! నీయనుగ్రహపాత్రుడనై యెప్పుడు వీడుదునోకదా!

శ్లో. ఏకాకీ నిస్పృహాశ్శాంతః
పాణిపాత్రో దిగంబరః

కదా శంభో భవిష్యామి
కర్మనిర్మూలనక్షమః. 89

తే. గీ. ఒంటి దిరుగుచుఁ గోరిక • లుజ్జగించి
శాంతిఁ జేకొని పాణి భా • జనుడనై ది
గంబరుడనై సమస్తక • ర్మంబు లెపుడు
మొదలు చెడఁ ద్రుంతుఁ బరమేశ • సదయహృదయ. 89

తా. హే! శంభో! నేను నిస్సంగుడనై, నిరాశాపరుండనై, శాంతాత్ముండనై, బిచ్చమెత్తుకొని దిగంబరుడనై, నా పూర్వకర్మములెల్ల నిర్మూలింపఁజాలు టెప్పుడో కదా.

శ్లో. పాణిం పాత్రయతాం నిసర్గశుచినా భైక్షేణ సంతుష్యతాం
యత్రక్వాపి నిషీదతాం బహుతృణం విశ్వం ముహుః పశ్యతామ్
అత్యాగేపి తనోరఖండపరమానందావబోధస్పృశా
మధ్వా కోపి శివప్రసాదసులభ స్సంపత్స్యతే యోగినాం. 90

చ. హితునకుఁ బాణిపాత్రస క • నిచ్చునకుఁ శుచిభైక్షమాత్రతో
షితునకు నెట్టితావున వ • సించెడు వానికి విశ్వముం దృణ
ప్రతినిధి జేయువానికిఁ బు • రస్థితుఁ డయ్యె నఖండ సౌఖ్య సం
గతుఁడగు యోగి కేర్పడునొ • కానొకమార్గము శంభుసత్కృపన్ 90

తా. అరచేయినే పాత్రగా నుంచుకొని పవిత్ర భిక్షవలననే తృప్తినొంది, ప్రదేశభేదములేక కూర్చుండుచు, క్షణక్షణము జగమునంతయు దృణప్రాయముగా జూచుచు, బ్రహ్మానంద జ్ఞానమనుభవించుచు నుండెడి యోగులకు చెప్పశక్యము గాని మోక్షమార్గము శంభుకృపవలన నత్యంత సులభముగా లభించును.

## 11 అవధూతచర్య.

శ్లో. కౌపీనం శతఖండజర్జరతరం కంథా పురస్తాదృశీ
నైశ్చింత్యం నిరపేక్షభైక్షమశనం నిద్రా శ్మశానేవనే
స్వాతంత్ర్యేణ నిరంకుశం విహరణం స్వాంతం ప్రశాంతం సదా
స్థైర్యం యోగమహోత్సవేపిచ యదిత్రైలోక్యరాజ్యేనకిం. 91

శా. కౌపీనంబును జీర్ణకంథయు నపే • క్షాశూన్య భైక్షంబు జిం
తాపాయంబు వనశ్మశానముల ని • ద్రావాప్తి దుర్వార స
ద్వ్యాపారంబు ప్రశాంతచిత్తమును యో• గారూఢియున్ వృత్తిసం
క్షేపంబుంగలదేని యోగికిఁ ద్రిలో • కీప్రాభవం బేటికిన్. 91

తా. సహస్రఛిద్రములు గలిగినగోచిగాని, బొంతనుగాని, విషయచింత లేకుండుటయు, బిచ్చపుదిండి, పేరికభూమియందో లేక కాననములందుగాని నిదురించుటయు, స్వేచ్ఛగాదిరుగుటయు, నిర్మలమగు మనస్సు గలిగియుండుట, యోగాభ్యాసమువలన నిలుకడగానియుండిన త్రిలోకరాజ్యాధిపత్యము వచ్చినను యోగి దృణప్రాయముగా జూచును.

శ్లో. బ్రహ్మాండ మండలీ మాత్రం
కిం లోభాయ మనస్వినః
శఫరీ స్ఫురితే నాబ్ధిః
క్షుబ్ధో న ఖలు జాయతే. 92

క. మండల మాత్రంబగు బ్ర
హ్మాండము లోభకరమగునె • యతి ధీరునకున్
నిండు సముద్రము జలచర
తాండవగతిచే విలోడి • తము గాదు గదా! 92

తా. మహాసముద్రమునందు యొకచేప యదరుటచే సముద్రము చలింపనట్లు ఆత్మజ్ఞానము బొందినధీరుని బ్రహ్మాండసమూహములకధికారిగా యుంచిరైనను కలఁచ జాలదు

శ్లో. మాతర్లక్ష్మి భజస్వ కంచి దపరం మత్కాంక్షిణీ మాస్మభూ
ర్భోగేషు స్పృహయాళవస్తవ వశే కానిస్పృహాణామసి
సద్యస్స్యూత ఫలాశ పత్రపుటికా పాత్రే పవిత్రీకృతే
భిక్షాసక్తుభిరేవ సంప్రతి వయం వృత్తిం సమీహామహే 93

క. అమ్మా లక్ష్మి నమస్కా
రమ్ములు గావించి నిన్నుఁ బ్రార్థింప చెద నా
నెమ్మదిలో విద్యరయా
పమ్మిన నేలుకొను ముఖ్య ఫలమదియకదా. 93

తా. అమ్మా! లక్ష్మీ! నమస్కారములు చేసి మరెవ్వరికైన నీ కొలువుమ నమ్మాల గోరకు నుమా! ఏమన భోగాసక్తిగలవారే నీకిష్టులుగాని, భోగాశలేని మాకును నీకును సంబంధ మేమి! నీవులేకున్నచో మాజీవనము జరుగదని మనకునుమా ఇప్పుడు మేము పవిత్రమగు మోదుగాకుల పాత్రగాజేసుకొని బిచ్చమెత్తుకొని దిన మాజీవితము గడుపవలచు కొని యున్నాము. ఇట్లు జీవించు మాకు నీతోటి సంబంధమేమి?

శ్లో. మహీ రమ్యా శయ్యా విపుల ముపధానం భుజలతా
వితానం చాకాశం వ్యజన మనుకూలోయ మనిలః
స్ఫురద్దీప శ్చంద్రో విరతి వనితా సంగ ముదితః
సుఖం శాంత శ్శేతే ముని రతనుభూతి ర్నృప ఇవ. 94

చ. ధరణి విశాలతల్ప ముప ధానము బాహువు నింగి చందువా
సురటులు గంధవాహములు శోభన దీపము చందురుండుగా
విరతివధూమణిం గలసి వేడుక మీఱ సుఖించి శాంతుఁడై
నిరుపమలీల యోగిశయ నించు మహీపతి మాళికై వడిన్. 94

తా. మూనికి నేలయే పాన్పు. లతవలె నిడుపైయున భుజమే తలగడ. ఇంపుగా వీచెడిగాలియే వీవన. చందురుడే దీపము. విరక్తియనెడి స్త్రీసంభోగమువలన సంతుష్టాంతరంగుడై యుండు యామునిసర్వసంపన్నుండైన సార్వభౌమునిం బోలి సుఖమున నిదురించును.

శ్లో. భిక్షాశీ జనమధ్యసంగరహిత స్స్వాయత్త చేష్టస్సదా
హానాదానవిరక్త మార్గనిరతః కశ్చిత్తపస్వీ స్థితః
రథ్యాకీర్ణవిశీర్ణ జీర్ణవ సనై స్సంప్రాప్తకంథాధరో
నిర్మానో నిరహంకృతిః శమసుఖాభోగైకబద్ధస్పృహః. 95

శా. హానాదాన విరక్త మార్గనిరతుం ♦ డక్షయ్యభిక్షాశి స్వా
ధీనారంభుండు లోకసంగదురితా ♦ తీతస్వభావుండు ర
థ్యాసిక్షిప్త విశీర్ణవస్త్రకృతకం ♦ థాసీనుండా త్మాక్షర
ధ్యానాసక్తుం డొకానొకండు విగతా ♦ హంకారు డొప్పారు భువిన్.

తా. బిచ్చమెత్తుకొని దేహయాత్రగడపుచు సర్వజనానుగ్రహపాత్రుడై సర్వేంద్రియములలోబరచుకొని హేయోపాదేయములు జూడక వీధిం బడిన చింకిగుడ్డతో నిర్మించిన బొంతగట్టుకొని, యభిమానాహంకారములనణచి శాంతముచే వచ్చుయానంద మనుభవించుచు నుండువాడు యెవడో యొకడరుదుగా యుండును.

శ్లో. చండాలః కిమయం ద్విజాతిరథవా శూద్రోథ కిం తాపసః
కిం వా తత్త్వవివేకపేశలమతిర్యోగీశ్వరః కోపి కిం
ఇత్యుత్పన్నవికల్పజల్పముఖరై రాభాష్యమాణా జనై
ర్న క్రుద్ధాః పథి నైవ తుష్టమనసో యాంతి స్వయం యోగినః.96

ఉ. మాలడో వీడు విప్రకుల ♦ మండనుడో మఱి శూద్రుడో తప
శ్శీలుడో సిద్ధుడో యనుచు ♦ జెంతలఁ జేరి వికల్పజల్పవా
చాల జనంబులాడగ వె ♦ సం గుపితాత్ములు గారు సమ్మదో
ద్వేలురుగారు మిన్నక భు ♦ విన్ విహరింతురు యోగిపుంగవుల్.96

తా. జనులు మార్గమున బోవుయోగుల జూచి వీడు చండాలుడా? బ్రాహ్మణుడా? శూద్రుడా? తపస్వియా? పరమార్థమును గోరెడి యోగిపుంగవుడా? యని తమ్ము త్రక్షేపింపగా కోపముగాని సంతోషముగాని లేక తలవంచుకొని పోవుదురు.

శ్లో. హింసాశూన్య మయత్నలభ్య మశనం ధాత్రా మరుత్కల్పితం
వ్యాళానాం పశవ స్తృణాంకురభుజ స్సృష్టా స్థలీశాయినః
సంసారార్ణవలంఘనక్షమధియాం వృత్తిఃకృతా సా నృణాం
యా మన్వేషయతాం ప్రయాంతి సతతం సర్వే సమాప్తింగుణాః. 97

చ. చిలువల గాలిమేపరులఁ ♦ జేసి తృణాంకురభోజనంబు భూ
తలశయనంబు గోవులకు ♦ దామర చూలి విధించెఁ దత్త్వవే
శలమతులైన వారలకు ♦ సన్నుతవృత్తిఘటించెదానిచే
దొలగు రజస్తమోజనిత ♦ దోషము లెల్ల భజించువారికిన్. 97

తా. పాములు, భూమియందు బరుండు జంతువులు, అవివేకము గలవగుటచే వాని కేప్రాణిహింసయులేని గాలిని గడ్డిని సృజించినాడు. సంసార సాగరమునుండి దరింజేయునట్టి జ్ఞానాత్ములకు వారిశక్తులన్నియు బూర్ణముగా జేర్పి పడయుందగిన బ్రతుకుగల్గించి యున్నాడు.

శ్లో. గంగాతీరే హిమగిరిశిలా బద్ధపద్మాసనస్య
బ్రహ్మధ్యానా భ్యసన విధినా యోగనిద్రాం గతస్య
కిం తై ర్భావ్యం మమసుదివసై ర్యత్రతే నిర్విశంకాః
కండూయంతే జరఠహరిణా స్స్వాంగమంగే మదీయే. 98

ఉ. శ్రీసురసింధుతీరమున ♦ శీతనగోపలసీమయందుఁ బ
ద్మాసన వర్తినై శివు ను ♦ పాస్తి యొనర్చుచు యోగనిద్రచే
భాసిలుచున్న నాతనువు ♦ పైఁ దమమేనులతీటదీఱ న
త్రాసములై కురంగములు ♦ రాపులు సేయుట గల్గునేకదా. 98

తా, గంగాతీరమున హిమగిరియందలి యొక శిలయందు పద్మాసనము వైచుకొని కూర్చుండి బ్రహ్మచింతనము జేయుచు సమాధియందుండగా యందలి ముసలిజింకలు

కదలక మెదలకయుండ నామేనిని నాకుచుండెడి దినములు నీకు ఎన్నడు ప్రాప్తించు నోకదా!

శ్లో. పాణిః పాత్రం పవిత్రం భ్రమణపరిగతం భైక్ష మక్షయ్య మన్నం
వి స్తీర్ణం వస్త్రమాశాదశకమపమలం తల్ప మస్వల్పముర్వీం
యేషాం నిస్సంగతాంగీకరణపరిణతస్వాంతసంతోషిణ స్తే
ధన్యా స్సన్య స్తదై న్యవ్యతికరనికరాః కర్మనిర్మూలయంతి. 99

ఉ. పాత్రము పాణిపంకజము ♦ భైక్షము భోజ్యమనల్పతల్ప మీ
ధాత్రి దిశాష్టకంబు పరి ♦ ధానమగున్ భువి నేరి కానుచా
రిత్రల సంగతాగుణధు ♦ రీణులు రీణసుఖానుభూతికిం
బాత్రులు మోహపాశముల ♦ బాసి దహింతురు కర్మబీజమున్. 99

తా పాణియే పవిత్రమయిన పాత్రగాను, బిచ్చమెత్తుకొని తెచ్చుకొన్న అన్నమే తరుగనిదిగాను, పదిగిక్కులే ము కిగిఃట్టి బట్టలుగాను భూమియే పాన్పుగాను గలిగి నిస్సంగమువలన పరిపాకమునొందిన మనస్సుగలిగి సంతోషించు పుణ్యాత్ములు దైన్యముచే గలుగు కష్టములన్నియు విడచి జన్మపరంపరలంగూర్చు కర్మబంధముల నిర్మూలనము చేయుదురు.

శ్లో. మాత ర్మేదిని తాత మారుత సఖే తేజ స్సుబంధో జలః
భ్రాతర్వ్యోమ నిబద్ధయేవ భవతామంత్యః ప్రణామాంజలిః
యుష్మత్సంగవశోపజాతసుకృతిస్ఫారస్ఫురన్నిర్మలా
జ్ఞానాపా స్తమ స్తమోహమహిమా లీయే పరబ్రహ్మణి. 100

మ. జననీ మేదిని తాత మారుత వయ ♦ స్యా వహ్ని చుట్టంబ జీ
వనమా సోదర తారకాపథమ భ ♦ వ్యప్రేమ సంధిల్ల మీ
కొనరింతుం జరమప్రణామము భవ ♦ ద్యోగస్ఫురత్పుణ్య సం
జనితజ్ఞాననిర స్తమోహతతి నై ♦ సద్బ్రహ్మముం బొందెదన్. 100

తా. మాతృసమానయగు నోభూమీ! పితృసమానవగు వాయూ! చెలిసమానవగు తేజమా! మంచిబంధువగు జలమా! తోబుట్టువగు నాకాశమా! ఇదెమీకు గడపటిసారి చేమోడ్చి మ్రొక్కెదను. మీతోడి స్నేహమువలన గలిగిన సుకృతముచే నాకుమిక్కిలి బ్రకాశించుచున్న విమలజ్ఞాన ముత్పత్తిలగా దానిచే అజ్ఞానాంధకారము గడచినవాడనై ఆనందస్వరూపమగు పరబ్రహ్మమందు లీనుడనగు చున్నాను.

ఉ. కూడిక చెంది కొన్నతమకూరిమికీర మ దెట్లు పల్కిన
స్వేదుక చేయుచందమున నీదయఁ గాంచిననాకవిత్వ మే
జాడ వహించి యున్నఁ గడు సమ్మదమే ఘటియించు నీకు బె
ద్దాడపురీనివాస నిజదాసశివంకర సోమశంకరా! 102

శా. తారామండలకుండలీశ్వర సుధాతారామరత్నామ్నా జ కాం
తారామ ర్త్యగజాఁబుజ ప్రభవకాంతారామగౌర ప్రభా
దారాలంకృతవామ భాగ బుధమందారాగ యోగీంద్రబృం
దారాధ్యాంఘ్రిసరోరుహద్వితయ వేదారామఖేలత్ప్రికా ! 102

మాలిని. ప్రణుతకుధరకన్యాపాలసాదృశ్యహేతు
ప్రణయభరశిరస్స వాప్రపితాబ్జారిరేఖా
ప్రణవనళినపీఠోపాంతసాంతత్యసేవా
చణహరివిధిరామాచామరోద్వీజ్యమానా! 103

క. సంతోషభాష్ప వారిని
రంతరదృగ్జలజభర్తృహరిసంయమిరాట్
శాంతస్వాంతనిశాంతని
శాంతోజ్జ్వలబోధదీప! శరవరచాపా! 103

—♦గద్య♦—

ఇది శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షవీక్షాపాత్ర యేనుఁగు
లక్ష్మణకవిరాజపౌత్ర తిమ్మనార్యపుత్ర వివిధ విద్వజ్జన
విధేయ లక్ష్మణకవి నామధేయ ప్రణీతంబయిన
సుభాషిత రత్నావళి కావ్యంబునందు వైరాగ్య
శతకంబున తృష్ణాదూషణాదిదశ
ప్రకరణంబులుగల
తృతీయాశ్వాసము
సంపూర్ణము.

# అధిక శ్లోకములు.

శ్లో. వివేకవ్యాకోశే వికసతి శమే శ్యామతితృషా
పరిష్వంగే తుంగే ప్రసరతి తరాం సా పరిణతిః
జరా జీర్ణైశ్వర్య గ్రసన గహనాక్షేపకృపణః
కృపా పాత్రం యస్యాం భవతి మరుతా మప్యధిపతిః.

మ. శమముం జారువివేక యుక్తిని వికా ♦ సంబొందఁగా దృష్ణ దు
శ్శమమౌ పట్టునువీడఁగాఁ గలుగు నా ♦ సౌఖ్యాతి రేకంపుఁ బా
కమునుం జూడ జరా విజీర్ణ విభవ ♦ గ్రాసాగతాక్షేప వి
శ్రమదీనంబగు వేల్పుతేఁడి దశయున్ ♦ జాలిం దగం జేయదే.

శ్లో. పురా విద్వత్తాసీదుపశమవతాం క్లేశహతయే
గతా కాలేనాసౌ విషయసుఖసిద్ధ్యై విషయిణాం
ఇదానీం తు ప్రేక్ష్య క్షితితలభుజ శ్శాస్త్రవిముఖా
నహో కష్టం సాపి ప్రతిదిన మధోధః ప్రవిశతి.

చ. చదు వది తొల్లి శాంతి పర ♦ సంతతి వంతలఁ బొందుచుండె దాఁ
బదపడిఁ గామలోలజన ♦ పాళిసుఖంబులు గూర్పఁబొచ్చె న
య్యది మఱి శాస్త్రదూరమతు♦లౌ పతు లిప్పు డుపేక్షసేయఁగాఁ
బొదుపరి నాఁడు నాఁటికిని♦ బ్రుంగు మఁ గ్రుంగుచు నున్న దక్కటా.

శ్లో. అతిక్రాంతః కాలో లటభలలనాభోగసుభగో
భ్రమంత శ్శ్రాంతాస్స్మ స్సుచిర మిహ సంసార సరణౌ
ఇదానీం స్వస్సింధో స్తటభువి సమాక్రందనగిర
స్సుతారైః పూత్కారై శ్శివశివశివేతి ప్రతనుమః.

ఉ. చారుముఖీ సుఖైకరతి • జానగు కాలమువోవు దెంచె సం
సారపుఁ ద్రోవఁ ద్రిమ్మరుటఁ • జాల శ్రమంబునుగల్గె నింకఁ బూ
త్కార పురస్సరంబుగను • దైవతరంగిణి తీరసీమనే
పారు నెలుంగునన్ శివశి • వాయని కూయిదు వారమెంతయున్.

---

శ్లో. అహో ధన్యాః కేచిత్త్రుటితభవబంధవ్యతికరా
వనాంతేచిన్వంతో విషమవిషయాశీవిషగతిం
శర చ్చంద్రజ్యోత్స్నాధవళగగనాభోగసుభగాం
నయంతే యే రాత్రిం సుకృతచయచింతైకశరణాః.

ఉ. దారితబంధులై విషయ • దారుణసర్పవిమార్గదూరులై
భూరితపోవనంబునను • బుణ్యచయైకపరాయణాత్మతః
శారదచంద్రికాధవళ • చారునభోపరిభాసమానమై
వారక వెల్గురేల్ గడపు • వారలు మాయురె యెంతధన్యులో.

---

శ్లో. మహాదేవో దేవ స్సరి దపిచ సై వామరసరి
ద్గుహా ఏవాగారం వసనమపి తా ఏవ హరితః
సుహృద్వా కాలోయంవ్రత మిద మదైన్య వ్రత మితి
కియద్వా వక్ష్యామో వటవిటప ఏవాస్తు దయితాః.

మ. దివిషద్వాహిని మాకు వాహిని మహా • దేవుండె దేవుండు బ
ల్గవియే మాకు గృహంబు నీదశ దిశ • ల్బాగైన పుట్టంబు మృ
త్యువ చూడంజెలికాఁడు సువ్రతమునెం • తోయీయఖుదైన్యవ్రతం
బు విచారింపఁగ వేయునేల వటస • ద్భూజంబె కంజాక్షియున్.

---

శ్లో. జ్ఞానం సతాం మానమదాదినాశనం
కేషాంచిదేత న్మదమానకారణం

స్థానం వివిక్తం యమినాం వియుక్తయే
కామాతురాణా మతికామకారణం.

క. జ్ఞానమ్ము ప్రధమస్థానంబుల
మానుచు సుజనులకు చిచ్చు ♦ మఱికొందఱకున్
జ్ఞానికిఁ గామికి విజన
స్థానము ముక్తియును రక్తి ♦ దానొసగుగతిన్.

---

శ్లో. శయ్యా శైలశిలా గృహం గిరిగుహా వస్త్రం తరూణాం త్వచః
సారంగా స్సుహృదో నను క్షితిరుహాం వృత్తిః ఫలైః కోమలైః
యేషాం నైర్ఝర మంబుపాన ముచితం రత్యైచ విద్యాంగనా
మన్యేతే పరమేశ్వరా శ్శిరసి యై ర్బద్ధో న సేవాంజలిః.

చ. శిలదగు శయ్య యిల్లుగుహ ♦ చీరయునార చెలుల్ కురంగముల్
నలువగు పండ్ల నిర్ఝరజ ♦ లంబులమన్కియు మారు కేళికిం
జెలువయు విద్యయై యమరఁ ♦ జేతుల నౌదల మోడ్చియన్యులం
గొలువక యుండువారలె యు ♦ కుంఠిత భూరి కృతార్థు లారయన్.

---

శ్లో. సత్యామేవ త్రిలోకేసరితి హరిశిరశ్చుంబినీవిచ్ఛటాయాం
సద్వృత్తిం కల్పయంత్యాం వటవిటపిభవై ర్వల్కలై స్సత్ఫలైశ్చ
కోయం విద్వాన్విపత్తి జ్వరజనితరుజాతీవ్ర దుఃఖాసికానాం
వక్త్రం వీక్షేతదుస్థేయదిహినబిభృయాత్స్వే కుటుంబేనుకంపామ్.

చ. హరుతల సోకుపోకముడి ♦ యంచితకాంతుల మించుగంగదరిన్
దరి గలమ్రానిపండులను ♦ నారల నల్వగు ప్రొప్పుఁజూపనే
వెరవరి గాని పేదఱిమి ♦ వేదన బొక్కు బిడ్డలాం
డ్రురదయఁ జూడకుండినఁ గ ♦ దుం బెనువంతల దారిఁ ద్రొక్కునే.

శ్లో. ఉద్యానేషు విచిత్రభోజన విధిస్తీ వ్రాతి తీవ్రింతపః
కౌపీనా వరణం సువస్త్రమమితం భిక్షాటనంమండనం
ఆసన్నం మరణంచ మంగళ సమం యస్యాంసముత్పద్యతే
తాంకాశీంపరిహృత్య హంత విబుధై రన్యత్ర కింస్థీయతే.

చ. అరిది మహాతపంబు చెలు ♦ వానెల దోటలఁ గుద్దువిందుగా
గరువవుగోచి బల్వలువ ♦ గాఁ దిరిపం బది భూషణంబుగా
మరణము దాపు మంగళస ♦ మంబుగ సొంపలరారునెందు నా
యిరవగు కాశివీడి బుధు ♦ లేటుకి నొండొక చోటనుండగన్.

---

శ్లో. నాయంతే సమయో రహస్యమధునా నిద్రాతినాథోయది
స్థిత్వా ద్రక్ష్యసి కుప్యతి ప్రభు రితి ద్వారేషు యేషాం వచః
చేతస్తా నపహాయ యాహి భవనం దేవస్య విశ్వేశితు
ర్నిర్దౌవారికనిర్దయాఖ్యపరుషం నిస్సీమ శర్మ ప్రదం.

శా. నీకుం గా దిది వేళ మంతనము సూ ♦ నిద్రించెడిన్ నాథుఁడుం
బోకే నిల్చియుఁ జూచితేఁ గినియుఁ బో ♦ పొమ్మన్నయవ్వాకిళుల్
వీఁకన్ వీడి మనంబవేగ చనుమా ♦ విశ్వేశు సద్మంబుకై
నీకుంగల్గు సుఖంబు కూ్రరుల రయన్ ♦ లేరందుదౌవారికుల్.

---

శ్లో. అకించనస్య దాంతస్య
శాంతస్య సమచేతసః
సదా సంతుష్ట మనస
స్సర్వా స్సుఖమయాదిశః.

క. దాంతుఁడు నకించనుడును
శాంతుఁడు సమచిత్తవృత్తి ♦ సంయుతుడు సదా

సంతుష్టుడునగు వానికి
సంతత మెల్ల దిశలు సుఖ ♦ సంతతి మయమున్.

---

శ్లో. ఉత్తిష్ఠ క్షణ మేక ముద్వహ గురుం దారిద్ర్య భారంసఖే
శ్రాంతస్తావ దహం చిరం మరణజం సేవేత్వదీయం సుఖం
ఇత్యుక్తోధన వర్జితే వ సహసా గత్వాస్మశానే శవో
దారిద్ర్యా స్మరణం వరం పరమితిజ్ఞాత్వైవ తూష్ణింస్థితః.

శా. ఆరుంబేదరయొకండు ప్రేతమునుడా ♦ యంబోయి యోమిత్రయీ
దారిద్ర్యంబును గొమ్ము లెమ్ము మృతిచే ♦ తం గన్నసొంపిమ్మువే
సారం జొచ్చితి నంచు వేడశవముం ♦ జావెంతయుకా మేలు మేల్
దారిద్ర్యంబున కంటె నంచు నదియుం ♦ దాబల్కకుండెం గదుకా.

---

శ్లో. ఏతా హసంతి చ రుదంతిచ కార్యహేతో
ర్విశ్వాస యంచిత పరంనచ విశ్వసంతి
తస్మాన్న రేణ కుల శీల సమన్వితేన
నార్యః స్మశాన ఘటికా ఇవవర్జనీయే.

తే. గీ. చిగురుబోడులు కార్యంబు ♦ నిగుడు కొఱకు
నగుదు రేడ్తురు నమ్మింతుౕ ♦ నమ్మ రొరుల
గాన కుల శీల వంతుండు ♦ మాన వలయు
నారులను వల్లకాటి ప ♦ నంట్లబోలె.

---

శ్లో. క్వచిద్వీణా వాదః క్వచి దపిచ హాహేతి రుదితం
క్వచి ద్విద్వద్గోష్ఠీ క్వచిదపి సురామత్తకలహః

క్వచి ద్వీణావాద్యం క్వచిదపి చ హాహేతి రుదితం
క్వచి ద్విద్వద్గోష్ఠీ క్వచిదపి సురామత్తకలహః
క్వచి ద్రామారమ్యా క్వచిదపి గళత్కుష్ఠవపుషో
నజానే సంసారః కి మమృత మయః కిం విషమయః.

చ. ఒకయెడ వీణియల్ మొరయ ♦ నొక్కెడహాయని యేడ్పు విన్పవే
యొకయెడ సూరిగోష్ఠి మఱి♦యొక్కెడ త్రాగి యొనర్పు చిప్పయొం
డొకట బెడంగుఁ జేడియలు ♦ నొక్కట గుష్ఠముగాఱు నారులా
నొకటి యెఱుఁ గరా దమృత ♦ మోమఱి సంసృతి దా విషంబొకో.

---

శ్లో. చలా లక్ష్మీ శ్చలాః ప్రాణా
శ్చలం జీవిత యౌవనమ్
చలాచలేచ సంసారే
ధర్మ ఏకో హి నిశ్చలః.

క. చలము సిరి చలము ప్రాణము
చల మరయఁగ జీవనంబు ♦ జవ్వన మటిచం
చలమగు సంసారము నం
దలఁపగ నిశ్చలన మొక్క ♦ ధర్మము కాదే.

---

# పుష్పగిరి తిమ్మకవి కృత
# నీతిశతకము.

అవతారిక — ఏనుగు లక్ష్మణార్యుని నీతిశతకంబు నందలి పద్య రత్నంబులకంటె పుష్పగిరి తిమ్మనార్యుని నీతిశతక పద్యములు వాడుకలో లేకపోయినను నుత్తమంబులని పలువురచే గొనియాడబడుటచే నా పద్యంబులనిందు బొందుపరచుచున్నాను.

ఉ. శ్రీలసమాన భానుశిఖిశీతమయూఖరుచుల్ గ్రమించి దిక్కాలపదాద్యుపాధులను గాంచక యంతము లేక జ్ఞానమాత్రాఘు నద్వితీయపరమాకృతి స్వానుభవైకగమ్యమై చాల వెలుంగు శాంతమయు శాశ్వత తేజముఁ గూర్చి మ్రొక్కెదన్.

ఉ. బోధలు మత్సరోచ్చలితబుద్ధుల నూఁగొనబో రహంక్రియాబద్ధులు గ్రువ్వున్ బరులు బాళి మెయిన్ విన లేరు బోధపుష్పద్ధతి నుక్కుఁ దక్కిన యపండితులొల్లరు సద్వివేదనస్నద్ధ సుభాషితంబు లివి నాతనువందె యణంగుఁ గాకి కన్.

ఉ. అజ్ఞుఁడు సజ్జనోక్తులెటులైనవినున్ సులభంబుగా విశేషజ్ఞుఁడు దెల్పినంత సరసస్థితి నూకొను జ్ఞానలేశదుర్విజ్ఞుల దుర్విదగ్ధుఁడగు పామరుఁడే గతి తెల్పబోయిన ప్రాజ్ఞతఁ జెందఁ డజ్ఞుడని బ్రహ్మయు రంజిలజేయ నోవునే

చ. మకరము కోఱనున్న పెనుమానిక మైన హరింపవచ్చు దుష్కర చలదూర్మిఘోషయగు సాగరమైన దరింపవచ్చు దుష్ప్రకుపితభోగినైన బువుదండనలె న్దలదాల్పవచ్చు బాయక ప్రతికూల మూర్ఖహృదయంబది త్రిప్పగరాదొకప్పుడున్.

చ. ఇసుకఁ బ్రయత్నత న్పిడిచి హెచ్చుగఁ దైలముఁ గాంచవచ్చుఁ బె
ల్లెసఁగెడు దప్పిసుక్కి మృగతృష్ణ జలంబులు గ్రోలవచ్చు నల్
దెసలఁ జరించి యొక్కపుడుదే దొరకున్ శశపున్విషాణము
న్బొసఁగదు దుర్వివేకియగు మూర్ఖుని చిత్తము ద్రిప్పనేరికిన్.

ఉ. బాలిశు చిత్త మేజనుడు బల్మి సుధోక్తుల ద్రిప్పబూను వాఁ
డీలవణాబ్ధిఁ దీపుఘటియింపఁగ బూనును దేనెబొట్టుచే
బాలమృణాలతంతువునఁ బన్నగరాజముఁ గట్టఁబోవు వ
జ్రాలకు బెజ్జముల్ నునుపఁజాలు శిరీషసుమాంతసంహతిన్.

చ. పరమహితంబుగాఁ దగునుపాయము ననిశంబధీనమై
పరఁగెమనట్లు లజ్జతకు బల్వగు కప్పడమొప్పఁజేసె ము
న్సరసిజగర్భుఁ డెట్లనిన సర్వమెఱింగిన వారి రచ్చలం
దెఱుఁగని వారి కాభరణ మొంచ విశేషపు మౌనమేకదా.

చ. ఎపుడొక యింతగంటినని యేనఁగుగీతి మదించి యుంటినో
యపుడె సమస్త విత్ప్రభుఁడనైతి నటంచు మదించె నామనం
బెపుడొక యించుకించుక బుధేంద్రుల చెంత నెఱింగికొంటినో
యపుడె విమూర్ఖతాత్త దురహంకృతి వీడె జ్వరంబుకైవడిన్.

చ. తొరగెడు జొల్లున న్దడిసి దుష్టపుగంపున జేరరాక లోఁ
బురుగులు గాఱ నంజుడును బోఁడిమి లేనినరాస్థిఁ జొక్కుచు
న్గొఱికెడు కుక్కపార్శ్వమునకు న్జనుదెంచిన యింద్రుఁగాంచిన
న్బొరయదు శంక క్షుల్లకులు బొందిన తక్కువ లెక్క సేతురే.

చ. సురపురినుండి శంకరుని జూటముజూటము వాసిగట్టుగ
ట్టురువడి పీడి భూమి భువినుండియు వారధి వార్ధి నిల్వక
య్యురగుఁలోకము న్బొరసియు న్మెఱసె న్మఱి గంగ గావున
న్మొఱకులు స్థానము ల్విడిచి నూఱుముఖంబుల గాసిఁ జెందరే.

చ. సురుచిర శాస్త్రపాఠ పరిశుద్ధవచస్కులు శిష్టదేయ సు
స్థిరనిగమాగము ల్గడుఁ బ్రసిద్ధులునై ఘనులే నృపాలుచే
బోరసిరో లేమి యక్కొఱదవ భూపతిదే ఘను లైనవారి లే
మరసి పరీక్షకుండు వెల యల్పము సేసిన రత్న మల్పమే.

చ. కనఁబడ దెవ్వ రేబలిమి గైకొనవచ్చునె నిచ్చలున్ సుఖం
బెనయఁగఁ జేయు నర్థులకు నిచ్చిన హెచ్చు యుగాంతవేళలం
దును జెడ దట్టివిద్య యనునూత్నధనంబు గడించి కొన్న వా
రిని సవరింప నేరని కుభృత్తులతోడపరోధమేటికిన్.

చ. అధిగతవేదశాస్త్ర పరమార్థుల బండితులైన వారి నీ
వధిప! నిరాకరింపవల దల్పతృణోపమనీదు లక్ష్మి య
య్యధికుల నడ్డగింపఁ గలదా మదవార్యసిక్తగండభా
స్వద్ధరణీభరాజములకుం బిసతంతు వదేమి యడ్డమో.

చ. అల కమలాసనుండు మదినల్క వహించిననేని యంచపై
లలిత సరోజినీ వనవిలాస నివాసము మాన్పఁగాక దా
బలియుఁడనంచు దాని దగుపాలును నీరును నేర్పఱించు నే
ర్పులఁ గలసుప్రసిద్ధ యశము న్హరియించుట కున్సమర్థుఁడే.

చ. జలకము గంధముల్ గుసుమచారుశిరోజములున్ భుజాంగదం
బులు శశిగౌరహారముఖభూషలు మర్త్యునకలంకరిఁ పలే
వలర నలంకరించు విమలాంచితసంస్కృతవాణియొక్కటే
పొలుపడుసొమ్ము లెల్లఁ జెడిపోవదు వాక్యనుభూషణంబిలన్.

చ. నరులకు దాఁచిపెట్టినధనంబను జిక్కనిరూపు శ్రీయశ
స్కరియును భోగభాగ్యసుఖకారిణియున్ గురుకోటికి న్మహో

గురువు విదేశబంధువును గూర్చిన దైవము రాజవశ్యమున్
వెరవు సువిద్యయే ధర నవిద్యుఁడె పో పశువర్గ మిట్టిదే.

చ. క్షమ మది నున్న నేల కవచం బది యేటికి క్రోధమున్న దా
యమలయ నేల చిచ్చు పరమౌషధమేల సుహృత్తు గల్గ మూ
ర్ఖమనుజుఁడున్న నేల ఫణి దివ్య మదేల సువిద్యయున్న సి
గ్గమరిన సొమ్ము లేల కవితాఢ్యత గల్గిన రాజ్య మేటికిన్.

చ. పరిజనకోటిపైఁ గరుణ బంధులపై మొగమాట మల్పులం
దరతియుఁ బ్రీతి సాధుజనులం దిల తేనియెడ న్నయంబు తెం
పరుల పయిన్ బుధాళియెడ నార్జవమున్ గురులందు నోర్పు బి
త్తరులెడ ధూర్తతం దెలుపు ధన్యులయందె తగు న్జగద్గతుల్.

చ. మతిగల జాడ్యముల్ చెరచు మాటలసత్యము గూర్చు మానము
న్నతి నెనయించు బాపములు నాశ మొనర్చు మనంబున న్ప్రస
న్నత గదియించు దిక్కులఘనంబుగఁ గీర్తులు నించు సాధుసం
గతి యిక నేవిశేషములు గల్గఁగఁ జేయదు మర్త్యకోటికిన్.

చ. చతురమతి ప్రసిద్ధము వచఃపరిశుద్ధి ప్రబంధవర్ధన
స్థితికలనా సమృద్ధి రససిద్ధియుఁ గాంచి యగణ్యపుణ్యభా
గతులితకీర్తి దేహధరులై సుకవీశ్వరు లెవ్వేడ న్జరా
మృతిజనితోగ్రభీతులు వహింపక యిప్పుడు నున్నవారిలన్.

ఉ. వాఁడె కులీను డుత్తముఁడు వాఁడె రసజ్ఞుఁడు వాఁడె యార్యుఁడున్
వాఁడె బహుశ్రుతుండు మఱివాఁడె గుణాఢ్యుఁడు వాఁడె వక్తయున్
వాఁడు సురూపియంచు ధనవంతుని నందఱు నెంతు రెంతయుం
బోఁడిమి గాన సర్వగుణముల్ గనకాశ్రియ భూతముల్గదా.

ఉ. ఆఁకట నుఱ్ఱిక్కిన న్మదిమి సంగము చిక్కినఁ గష్టదుర్దశ
లోఁకిన గాంతిదక్కిన నసువ్రజము న్జనుచున్న డస్సిన
న్వీఁక మదేకుంభపదవీపిశితస్పృహఁ జెందు సింగ మ
ట్జాఁకట వాడుపు ల్మెసవునో యభిమాని మృగేంద్రుఁ డెయ్యెడన్

ఉ. స్నాయువసాదు లల్పములు నంజుడులే దది పంకదూష్య మా
హేయపుటస్థిఁ గుక్క భుజియించుచు రంజిలు దాన క్షుత్తునుం
బాదుదు ప్రాప్తజంబుకము మాని మృగేంద్రము చించునేనుఁగన్
డాయుదు రెల్ల వారు కదుడస్సియు శక్తి కొలందికోరికల్.

చ. బలువిడి తోఁక ద్రిప్పి పతిపాదములూనుచు గ్రిందవాలుచు
న్వాలికిలి నేలపైఁబడుచు వేమఱునో ఉదరంబె చూపుచు
న్బెలుకురు కుక్క కొక్కువడి పెట్టరు ధీరతఁ జూచుచున్ మదా
వళము భుజించు జాటుశతవాక్కుల బెన్గవణంబు లిమ్ములన్.

చ. ఎడతెగకిట్లు సంసరణ మెల్లపుడున్ బరివర్తిలంగ నే
యెడ మృతిఁబొంది యెవ్వఁ డుదయింపడు ప్పుట్టక కేమి యెవ్వఁ డీ
పుడమి జనింపఁ దత్కులము భూరిసమున్నతిఁ జెందు వాని దే
యొడలును జన్మము న్బరువు లోకొక్కక వో బదికోట్లు పుట్టవే.

ఉ మానసర వాసనైన కుసుమస్తబకాకృతి రెండువృత్తుల
న్భాసిలు మానశాలియగు ప్రాజ్ఞుఁ డదెట్లనఁగా బురంబు దా
జేసిన సర్వలోకములు జెల్వుగ నౌదల దాల్పనుండు న
య్యాసలు వాసిన స్దపసియై వనసీమల నుండు నెమ్మదిన్.

చ. అల గురుభార్గవప్రభృతు లైదుగురు న్మరువొంద వారిపై
వలుగక శీర్షమాత్రయుతు డయ్యునుజూడు విశేష విక్రమే

చ్ఛలుగల రాహుదైత్యపతి చంద్రదినేంద్రుల బట్టు నిర్జ్వర
స్థలమున బర్వవేళల యశంబున కింతె మహద్విరోధముల్.

చ. ఘనుఁ డహిభర్త భోగఫలకంబున దాల్చు జగంబులెల్ల నా
యన నలకూర్మరాజు చరమాంగమునన్భరియించు నాసుగుణా
ఢ్యుని ధరియించు ఘోణిమణి యాను దదంగభరంబనాదృతి
న్వనధి యయారె యార్యుల యుదార చరిత్రములౌవిచిత్రముల్.

ఉ. ఆకడ దండిక్లేశవశుడై కృశియింపగ గాంచుచున్న మై
నాకునకు న్బయోధి భువనంబులఁ గూలుట సర్వమా సడిం
జేకొనుకంటె దృప్త సురశేఖర భూరి శిఖి స్ఫులింగ కీ
లాకర భీకరోరుకులిశాహతి జచ్చిన గీర్తిగల్గదే.

చ. కరము బ్రకాశమొందు రవికాంత మచేతనమయ్యు జూచితే
యొఱ బఱికంబు కోపమొక యించుక భానుఁడు పాదమూఁదినన్
గఱకఱి జెందినట్టు లధికత్వరమండెడుఁ జండతేజమున్
బొరసిన పూరుషుల్ పరులు పూనిమొనర్చు నవజ్ఞలోర్తురే.

ఉ. సింగముగన్న యక్కొదమ చిన్నది యయ్యు నభంగవాసనా
సంగత భృంగదాన ఝురసంగమలీమసగండరంగమా
తంగ విభంగ భంగులకు దాటు బలాఢ్యులకిన్ స్వభావమీ
యంగు వయోవిశేషము పరాక్రమసంపదకున్ బ్రధానమే.

చ. కులము రసాతలస్థలిని గూలిన మంచిగుణంబధోగతిం
బొలసిన శీలమద్రితటభూమిని జాఱి విదగ్ధమైన ద్వి
ట్కులహరశౌర్యమందుఁ బిడుగుల్ పడినన్ గడుమేల్ ధనంబెకా
వలె నదిలేనిచోఁ దృణలవంబులుగా గుణకోటులిన్నియున్.

చ. కుమతులతోఁ జరన్ నృపతి కూటమిచే యతి లాలనన్ సుతుం
డమహితవిద్య విప్రుఁ డనదాత్మజుచేఁ గుల మల్పుచే సుశీ
లము త్రిప హేలచే గృషి యలక్ష్యతఁ జెల్మి ప్రవాసవృత్తివి
య్య మరతి దుర్ణయాప్తి సిరి యర్థము లీవిఁ బ్రమాదతన్ జెడున్.

చ. అనుపమ దానభోగవిలయంబులన న్దగు మూఁడు మార్గముల్
దనరు ధనంబునందది యుదారమతిన్ మనుజుండెఱింగి దా
ననుభవిగావలెన్ బుధుల కర్థుల కావలె లేక మూలయిం
టనె పెనుఁగాంతుదాఁప నది దక్కదు మూఁడవ త్రోవఁగై కొనున్.

ఉ. శాణవిలీఢరత్న మరిసందళితాంగ జయాఢ్యుఁడున్ మద
క్షీణగజంబు నిర్జలవిశీతలసైకతశారదాపగా
శ్రేణి కళావశిష్టశశి చెల్వ్విసిచే రతిఁజిక్కుబాల వి
శ్రాణనలీలఁ బేదగిలురాజులు మింతురు కార్శ్యమొందియున్.

ఉ. చేరెడుగంజికోస మొరుచెంగటి కేఁగుచు డస్సియున్నవాఁ
డే రమఁ జెంది వెక్క జగమెల్లఁ దృణంబుగ నెంచు నర్థముల్
మీఱిన యందునన్ దుదనులేక యణంగిన యందున న్నరున్
శేరును బెక్కువస్థలు గ్రృశించుట మించుట దానవే కదా.

చ. తడవ నిబద్ధియొక్కపుడు దబ్బఱ యొక్కెడ నిష్ఠురోక్తు లొ
క్కెడఁ బ్రియవాదమొక్కపుడు హింసయొకప్డు దయాళుభావమొ
క్కెడ ధనకాంక్షయొక్కపుడు నిచ్చుటలొక్కెడ వెచ్చమొక్కెడన్
గడన యొకప్డుగా గణిక కైవడి నా నృపనీతి నైకతన్.

చ. ఇల యను ధేనువున్బిదుక నిచ్చ జనించిన యేని రాజ నీ
వెలమిని దూడఁ బెంచినటు లెప్పుడు లోకము బ్రోవవయ్య నీ

వలన జనంబు లెస్సయయి వర్ధిలు చుండినఁ గల్పవల్లియుం
బలె సకలేప్సి తార్థఫలవర్గము లీధర నీనకుండునే.

ఉ. భూరితరాజ్ఞకీర్తియును భూసురరక్షయుఁ బాత్రదాతయై
మీఱుట భోగమొందుటయు మిత్రులఁ బ్రోచుమనాఁగ లొప్పునీ
యాఱు గుణంబు లేనృపులయందు రహింపవొ వారినూర కే
యాఱడి గొల్వనేల గలదా ఫలమాశ్రితకోటి కెంతయున్.

చ. వనజభవుండు మున్నొసట వ్రాసిన దెంతయొ యంత కొంచమో
ఘనమొ సురాద్రినున్న మరుఘట్టముఁ జేరిన వచ్చు హెచ్చురా
దనఘ వృథావ్యథ ల్గనకు మాఢ్యుల చెంత ధరింపు ధైర్యమూ
నిన ఘటికెచ్చునే జలము నీరధి ముంచిన నూత ముంచినన్.

ఉ. కారణ మింత లేకొకరిఁ గాంచినఁ గిన్కవహించు టాత్మని
ష్కారుణికత్వ మొందుటొరుకాంతఁ దలంచుట లన్యవిత్తము
ల్గోరుట బంధులు న్సుజనులు న్గను మేలు సహింపకుండుటల్
క్రూరవిచారులౌ నరులకున్ మృషగాదు స్వభావసిద్ధముల్.

చ. లలితకళావిలాససమలంకృతుఁడైనను దుర్జనుండు చెం
తలవసియింపఁగాఁ దగఁ డనర్హుఁడు వానిఁ ద్యజింప నేతగున్
గలితనవారుణారుణధగద్ధగితోరుఫణామణిప్రభల్
గల వని చెంత నున్న భయకంప మొనర్పదె సర్పమేరికిన్.

చ. త్రప జడవృత్తి సద్వ్రతము దంభము శుద్ధతమైదుబంటు ని
ష్కృపుడు గురుండు బుద్ధిప్రియరీతులు వల్కుట దైన్యవృత్తి తే
జపుఁ బస గర్వమా స్థిరుఁడశక్తుఁడు వక్త బహుప్రజల్పుఁడం
చెపుడును నిందసేయు ఖలుఁ డే సుగుణంబిఁక వాఁడు మెచ్చునో.

చ. అవగుణ మేల లోభ మెనయన్ గొల లేటికి గొండెమున్న స
త్యవచన మున్న నేల తప మాత్మశుచింగనఁ దీర్థమేల మే
లవు సుజనత్వ మేల సుగుణాళి మహత్త్వమె చాలు సొమ్ములే
ల విభవ మేల విద్యప్రబలన్ సడిఁజెందిన మృత్యు వేటికిన్.

చ. పగలిటఁ గాంతిలేని శశిసాయము దేఱిన భామ పద్మినిం
దగులమి రిత్తయౌకొలన నక్షరరూప వదాస్యమున్ ధనా
శగల ప్రభుండు లేమి నవిశంబుఁ గృశించుబుధుండు భర్తృయో
లగమున నుండు సూచకుఁ డిలన్ విడఁగూడని సప్తశల్యముల్.

ఉ. ఆతత చండకోప దహనాక్షయ రూక్ష కటాక్షు లైన ధా
త్రీతల నేతలందుఁ గలదే తనవారును ప్రీతి తప్పినన్
ఘాతయ సేయఁ జాతురధికత్వరమండెడు వహ్ని వ్రేల్పుతో
హోత నటంచు సంటుకొన నోరిచి శీతల వృత్తిఁ జూపునే.

ఉ. ఊరక యున్న మూగ వచనోద్ధతి జూపిన గొంటుచేరువన్
జేరిన దంట దవ్వుల వసించినచో నసమర్థు డోర్పుతో
నోరిచి కొన్న భీరుఁడు దురుక్తులు సైచిన జాతిహీనుడం
చాఱడి బెట్టు రాజువశమా నృపసేవ యగత్య మేరికిన్.

చ. సకలబలావళిన్ బ్రియ మెసంగఁ బ్రకాశ మొనర్చి హెచ్చి పా
డికిఁ జొరలేక శామును ఘటించినదుష్టతమాధకక్రియా
ప్రకరము లన్నియున్ మఱచి భాగ్యముచే సిరిఁజెంది సర్వదా
షకు డగుదుష్టుదృష్టిఁ బడి సౌఖ్యము లెవ్వరు గందు రిమ్మహిన్.

ఉ. హెచ్చిలుఁ దొల్తఁ బిమ్మట క్షయించును రేపటిపూఁటనీడ నాఁ
గుచ్చితుచెల్మి దొల్తఁ గడుగొంచమ యైమఱి మీఁద హెచ్చుచున్

వచ్చు వివేకిమచ్చికఁ ధ్రువంబుగ మాపటిపూటనీడ నా
నిచ్చలు నిత్తెఱం గెఱిఁగి నెయ్యము సేయఁదగు న్వివేకితోన్.

ఉ. నీరముఁ బూరి సంతసము నిచ్చలు జీవనమై పొసంగ నె
వ్వారికిఁ గీడు సేయక ప్రవర్తిలు మీనమృగార్యులందు ని
ష్కారణవైర మూనెదరు కష్టులు దాశకిరాతసూచకుల్
వారిజగర్భుకట్టడయొ వారిదయారహితస్వభావమో.

చ. వరగుణరీతి బ్రీతి గురుపట్ల వినీతి బుధాప్తి వాంఛయున్
దఱచుగ విద్య నాస్థయు సధర్మిణిపై రతి లోకనిందలన్
వెఱపు శివార్చ భక్తి మతినిగ్రహశక్తియు దుష్టసంగమం
దరతియు గూర్చి యొప్పెడుమహాత్ములఁ గూర్చి నమస్కరించెదన్.

ఉ. ఆపదలందు ధైర్యము మహాభ్యుదయంబున నోర్పు ప్రౌఢవా
చాపటిమంబు రచ్చలను సంగరరంగమున న్పరాక్రమా
టోపము కీర్తి నిచ్చయుఁ గదున్ వ్యసనంబు శ్రుతిన్ దలిర్ప బ్రి
జ్ఞాపరు లొప్పుచుందు రివి సాజము లై తమయందు బొందఁగన్.

చ. కరమున శ్లాఘ్యదాన మెసఁగన్ దల శ్రీగురుపాదవందనం
బారయ ముఖంబు సత్వరమఁ బూజయాస్పదవృత్తి బాహులన్
మెఱయ మహోచ్ఛవృత్తి మదిమించ శ్రుతంబు శ్రుతిద్వయిన్ దగన్
సిరులు వినా విభూషలుగఁ జేయుదు రీగుణముల్ మహామహుల్.

చ. ఒకరిధనంబుఁ గోర కనృతోక్తులు వల్కక వధ్యునైనఁ జం
పక తగువేళ నీవి కలమాత్రము మానక నన్యుఁ గూర్చి ప
ల్కక గురుభక్తి వీడ కతికాంక్షలఁ గూడక భూతమైత్రిబా
యక నరుఁ డున్న మంచి తెరు వంచు శ్రుతుల్ స్మృతు లెంచు నెప్పుడున్

ఉ. సంపదఁ గన్నవేళ గుణశాలులచిత్తము, గూర్మవృత్తి వ
ర్తింపక నూత్నపల్లవశిరీషను నుత్పలకోమలస్థితిన్
సొంపు వహించు నాపదలు సోఁకినవేళ విశాలశైలని
ష్కంపతటస్థలస్ఫురదఖండశిలాకృతిఁ గర్కశంబగున్.

చ. నయగతిఁబ్రీతి ప్రాణములు నాశిలినన్ మలినత్వ మింతలే
మియు ఖలు లన్నఁ జేరమియు మిత్రుల నొచ్చియువేడఁబోని యు
న్కియు వెతలందుఁ దాల్మియు మనీషులజాడ మెలంగుటల్ బుధా
శయములు కత్తిమీద పెనుసాము లి వెవ్వరిచేతనేర్చిరో.

ఉ. ఎంతయు దాముగుప్తముగ నిత్తురు సజ్జను లిల్లు జేర బూ
జింతురు ప్రీతి జేసినది సెప్పరు మేల్ సభ నెంతు రన్యమె
ప్పింపన తగ్గడింతు రసయిందురు శ్రీగలగర్వ మంచిత
స్వాంతులు కత్తిమీదిపెనుసాము లి వెవ్వరిచేనెఱింగిరో.

చ. బలువుగఁ గాగుసయ్యానముపైఁ బడఁజోయకణంబు నాశిలున్
బొలుపరి తామరాకుపయి ముత్యపురూపున నిల్చుగొంతసే
పల జలబిందువే యుపధియందలిశక్తిని స్వాలి ముత్య మై
మలయును దత్సమం బధమమధ్యమను త్తమ సఖ్యముల్ క్రియల్.

చ. తగుఁ దవళ్ళఁ దండ్రికి ముదం బొదలించినవాడె పుత్రుడున్
మగనికి సంతసం బెసగ మక్కువ జూపినదే పురంధ్రి ప్రే
మ గలిగి కల్మిలేముల సమంబుగ వర్తలువాఁడె మిత్రు డీ
ముఁగురు లభింతు రచ్ఛమతి మున్ సుకృతంబు లొనర్చువారికిన్.

చ. ఒరులకు నమ్రులై ఘనత నొంది పరస్తుతి నాత్మసద్గుణ
స్ఫురిణ తెల్పక యున్న్యపయి బూనియుసార్థములున్వహించి ము

ష్కరుల దురుక్తి యుక్తు లతిశాంతిని మార్చి తదార్తి గాదు లై
యురు దగుచర్యల న్మెలఁగు నార్యులు పూజ్యులు గారె యేరికిన్

చ. ఫలముల బిక్కటిల్లియును బాదపముల్ గను నమ్రభావముల్
జలధరపంక్తి దవ్వుల నెసంగియు నమ్రత నిచ్చు దోయముల్
గలిమిఁ జెలంగియున్ ఘనులు గర్వముఁ జెందర యుందు రింతయున్
దలఁప బరోపకారులగు ధన్యులకైన స్వభావకృత్యముల్.

చ. చెవు లురుకుండలద్యుతులచేతను గాదు శ్రుతి న్వెలుంగు ర
త్నవలయయుక్తిఁ గాదు కరయి దానముచేఁ జెలఁగున్ దయామతిన్
సవు రగువారిదేహములు చందనకుంకుమరచ్చచేతఁ గా
దవనిఁ బరోపకారమహిమాతిశయంబునఁ జాల శోభిలున్.

చ. జలజపరంపరన్ సురుచిసంపద నింపునినుండు కైరవో
త్పలనికరంబుల స్సరము భాసిలఁ జేయుసుధాంశుఁ డంబుదా
వళి తనయంతఁ దా గురియు వర్షము హర్షముఁ జెంద లోక మి
ట్లలఘుమతుల్ స్వయంగతపరార్థహితుల్ సుకృతుల్ దలంపగన్.

చ. ఒరులపనుల్ ఘటింతురు నిజోద్యమముల్ద్యజియించి యుత్తముల్
పరులపనుల్ స్వకార్యములుఁ బాయక పూనుదు రెవ్వి మధ్యముల్
పరహితముల్ ప్రజార్థరతిభగ్న మొనర్తురు మర్త్యరాక్షసుల్
పరహిత మూరకే చెరచు పామరు లెవ్వరొ తోప దాత్మకున్.

ఉ. పాపము సేయనీదు హితపద్ధతిఁ గూర్చు రహస్యమా
దాపను జూచు సద్గుణవితానము లంద ఱెఱుంగ నెంచు దా
నాపద వచ్చి న్విడువ డక్కఱవేళల నిచ్చు దీర్చు సం
తాపము మంచిమిత్రుడని తద్గుణముల్ బుధు లెంతు రెంతయున్.

చ. తనుఁ గలసెన్ జలంబు లని దానికిఁ బాల్ స్వగుణం బొసంగి వెం
టనె యది గావఁగాఁబడు నెడన్ జల మోర్వక కాకనింకె న
య్యనుగు విపత్తు సైపక మహాగ్ని బడంగ దొడంగె బాలు గ్రి
క్కున జలమంతలోఁ గలయ గ్రమ్మఱ నిట్టిపొ సాధుమైత్రముల్.

శా. ఇందె శయించినాఁడు కమలేశ్వరుఁ డిందె వసించె దద్విష
ద్బృందము లిందె చెందె శిఖరిచ్ఛటలున్ శరణంబు బాడబం
బుం దగ నిందె యుండె ఘనపుష్కలముఖ్యము లున్నవద్దిరా
యొందున గాన మెంతబరు వీదలధిం దిరి మేము పూనెడిన్.

ఉ. ఆతతలోకధారిచరమాంగలసత్కమఠేంద్రుఁ డొక్కడే
జాతుఁడు జన్మ మన్న ధ్రువుజన్మమె సద్గ్రహచక్రవర్తన
స్ఫీతతక్రిందమీఁద హితశీలురు గానిజనుల్ వృథాచ్ఛదా
జ్ఞాతభవాండ భాండఫలజంతుసముల్ మృతజాతు లేటికిన్.

ఉ. ఆస నడంపు మాను క్షమ యాఁపకు గర్వము నాడు సత్యమే
దోసము సేయఁబోకుము బుధు ల్చనుత్రోవనె పొమ్ము విద్వదు
ల్లాస మొనర్పు ముగ్రరిపులన్ శమియింపు వహింపు కీర్తి సం
త్రాసులఁ బ్రోవు సద్గుణము నాఁపుమివే కద సాధుకృత్యముల్.

మనసులు వాక్కు లంగములు మానితపుణ్యసుధాప్రపూర్ణతం
దనరనిజోపకారు లుదితత్రిజగజ్జనులై పరు ల్బరిం
చినపరమాణుమాత్రగుణశీలము లద్రులు చేసి హర్షతో
యనిధుల నోల లాడుచు మహామహు లుందురు కొంద ఱిద్ధరన్.

పరుఁడు ప్రబోధకుం డశని ఘోరపువా లమరుల్ స్వసైనికుల్
[illegible] ంబకరి షోర సహ [illegible] ధు ద [illegible]

ట్లరు దగుబల్మి గల్గియు బలారి బలారిపుఁ ధాటి కోడఁడే
శరణము దైవమే పురుషశక్తి వృథా యది యేల కాల్వనే.

చ. అనువుల నాసగ్రుంగ దను వ తెయుఁ బెద్ద మనుంగ సంద్రియో
ల్లసన మణంగ నాకట నలంగుచు నోటన రేయియెల్ల బె
ట్టెసరఁగ దానపుష్పలరి డిగ్గన లోనగాను భోగి తత్సుమ క్
వెస జను దైవ మిడునా క్షయవృద్ధుల స్వస్థత నుందుకే జనుల్.

ఉ. లేవడి బొందియుఁ గెమ్మెల లీఁకతఁ బొందియు లేచు గ్రక్కునన్
దైవబలంబునన్ బుధుఁ డుదారతఁ గందుక వృత్తిహస్తదు
ర్భావుఁడు తద్విధంబున విద్రవవచ్చిన నొచ్చి నాశిలున్
లేవక మంటిపై బడు ఘటిణి బడి గట్టి యణంగు కైవడిన్.

చ. వడి నెద యెడ బట్టలవాఁ డొకఁ డెండను నెత్తి మండ నల్
గడలను నీడచో టరసి కానక దవ్వుల తాటిచెట్టు గ
న్పడఁ జని క్రింద నిల్వ నలపండుపడన్ దల బ్రద్దలయ్యె నె
య్యెడలకుఁ జన్న దైవహతు నించుక డించక ముంచు నాపదల్.

చ. గజభుజగంబులన్ బలుఖగంబులఁ గట్టుట సూర్యచంద్రులన్
గజబిజి చేసి దుర్గ్రహము కౌర్యమున న్గబళించియేచుటల్
బుజమతు లౌను హోత్ములు దరిద్రత వేగుట జూచి యయ్యయో
విజగతి నెంత చేసె నతినిష్ఠుర దైవమటంచు గుందుచున్.

చ. సరసగుణాద్యశేషగుణసంపద నిల్వ నిధాన మౌ మహా
పురుషశిఖామణిన్ భువికి భూషణరాజముగా సృజించి య
త్తెఱఁ క్షణభంగురంబుదను యని నొనర్చినయేని యేటి నే
ర్పరి విధి యాతఁ డూనినయుపంచితభావము కాష్ఠ [illegible]

అతులసుధారసైక విధియై సకలౌషధులేలునాథుఁడై
శతభిషగన్వితోద్గమనసంభృతుఁడై శివమౌళిభాగలం
కృతమణియై వెలుంగు శశి యొప్పుడుఁ బాయఁడు రాజయక్ష్మ హా
హతవిధిపాక మేదొరల కైనను దాఁట నలంఘ్యమే కదా!

హతవిధి యన్కులాలవరుఁ డాత్మయునం దగు సృష్టికన్ మహో
ద్ధతిఁ గొనిముద్ద చేసి వ్యథ యన్ పృథుచక్రముఁ జేర్చి యావద
న్నతఘనదంతఘాటన మనంబును బల్కఁ ద్రిప్పుచున్నవాఁ
డతఁ డిఁక నేమి సేయునో కదా చెలికాడ వెలుంగ నేమియున్.

పతివిధి యేమి యెవ్వనికిఁ బాసిన ముసర్పునో వచ్చు సంతసం
యతనికి నిచ్చు సంశ్రియ మహాశ్రియమున్ గుఱి గాపు సర్వది
క్ప్రతతులు నిండి మేఘములు పాత్యాహమును గురియంగ నేయుఫీ
ప్సితములు గల్గె ద్విత్రిజలబిందువులే కద చాతకాళికిన్.

అంబుజబాంధవుం డహరహంబును డగ్గఱి వారి సూడి యే
యంబరఖండ మూని తిరుగాడుచునుండును గ్రుంకుదాఁక స
య్యాంబరఖండ మొందియె సుధాంశుఁడు ద్రిమ్మరు రాత్రు లెల్లదే
వం బె ఘటించినన్ గడువవచ్చునె దుర్గతి యెంతవారికిన్.

ఉరుగణయోగి భర్తృహరి చమత్కృతిసంఘటింపఁగాఁ
గరము దనర్చు నీతిశతకం బది పట్టి తెనుంగుబాసచేఁ
దిరముగఁ జెప్పెఁ బుష్పగిరితిమ్మన చంపకమాలికాపరం
పరలు శివాంఘ్రిపూజలుగఁ బండితు లెంతయు సంతసింపగన్.

క. ఈ కావ్యము లిఖయించినఁ
జేకొని చదివినను వినిన శిష్టుల కెల్లన్
శ్రీకంఠుఁ డిచ్చుఁ గరితురక
గా కల్పానల్ప నరిచి రాయుష్యంబుల్.

పుష్పగిరి తిమ్మ కవికృత
నీ తి శ త క ము
సంపూర్ణము.



శాకుంతలముద్రాక్షరశాల, రాజమండ్రి.—1938.